సాహిత్య

# ప్రస్థానం

జూన్ 2012

వెల రూ. 10



## సాదత్ హసన్ మంటో శతజయంతి

సాహితీ స్రవంతి

సాహిత్య ప్రస్థానం
జూన్ 2012
సంపుటి : 12 సంచిక : 04

# పెట్రో మంటలు

పెట్రోలు ధరను ఒక్కసారిగా 8 రూపాయలు పెంచుతూ కేంద్ర ప్రభుత్వం ప్రకటన చేసింది. గ్యాస్ సిలిండర్ మీద ఉన్న సబ్సిడీను కూడా ఎత్తేస్తామని చెప్తుంది. ఇటీవలనే రాష్ట్ర ప్రభుత్వం కరెంటు ఛార్జీలతో సహా రకరకాల వాటిని భారీగా పెంచింది. ఈ నిర్ణయాలన్నీ సామాన్య, మధ్యతరగతి ప్రజలపై తీరని భారాన్ని వేయనున్నాయి. మరోపక్క కేంద్ర ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీ నోటి నుండి పొదుపు చర్యల ప్రస్తావనలు వినపడ్డాయి. ప్రజలను తీవ్ర ఇబ్బందుల పాలుచేసే ఈ నిర్ణయాలన్నీ ఈ ప్రభుత్వాలు ఎందుకు తీసుకుంటున్నట్లు? ఇవన్నీ గమనించినప్పుడు ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రపంచీకరణ విధానాల స్వభావం కొట్టొచ్చినట్టు కనపడుతుంది. 1990 దశకంలో ప్రారంభమయిన ఈ సరళీకరణ విధానాలు ఈ రోజుకొచ్చేటప్పటికి ఎవరికి ఉపయోగపడ్డాయో స్పష్టంగా అర్థమవుతుంది. నిజానికి విశాల ప్రజానీకానికి ఉపయోగపడే విధానాల పేరుతో వీటిని అమలు చేసారు. అదే వాస్తవమైతే ప్రజల జీవన భారం తగ్గాలి. ఆదాయాలు పెరగాలి. విద్య, వైద్యం వంటివి ప్రజలకు సులభంగా అందుబాటులో ఉండాలి. ప్రజల కనీస అవసరాలకు ఇబ్బంది పడకూడదు. ప్రతీ ఒక్కరికీ ఉపాధి లభించాలి. వ్యవసాయం పచ్చ పచ్చగా ఉండాలి. అలా జరిగిందా? నిజానికి ఈ ప్రపంచీకరణ విధానాలు వాటికి పూర్తి వ్యతిరేకమైన ఫలితాలను ఇచ్చాయి. కేవలం కొద్దిమంది సంపన్నులు మరింతగా సంపన్నులు కావడానికి, కొద్దిపాటి ఉన్నత మధ్యతరగతి వర్గాన్ని భ్రమలకు లోను చేయడానికి ఈ విధానాలు పనికొచ్చాయి. మూడొంతుల సామాన్య ప్రజానీకంలో ఈ విధానాలు అభద్రతను పెంచాయి. మానవ విలువలను మరింత క్షీణింపజేశాయి. వ్యవసాయాన్ని పూర్తిగా దెబ్బతీసాయి. రైతుల ఆత్మహత్యలు వేలలోకి చేరాయి. భూములు, ప్రకృతి వనరులతో సహా అమూల్య సంపదను కార్పొరేట్ కంపెనీలకు కట్టబెట్టాయి. రాజకీయ, కార్పొరేట్ వర్గాల మిలాఖత్‌తో దేశం అవినీతితో అల్లాడుతున్నది. ప్రతిరోజూ కోట్లాది రూపాయల కొత్త కొత్త కుంభకోణాలు వెల్లడవడం పరిపాటిగా మారింది. కేవలం కొద్దిమంది స్వార్థం కోసం, స్వలాభాల కోసం విశాల ప్రజానీకానికి నష్టం చేకూర్చే చర్యలను తీవ్రంగా వ్యతిరేకించాలి. ముఖ్యంగా సాహిత్య, సాంస్కృతిక రంగాలకు చెందిన సంస్థలు, వ్యక్తులు ఈ విధానాలకు వ్యతిరేకంగా కార్యక్రమాలు చేపట్టాలి. ప్రజలలో చైతన్యాన్ని రగిల్చి పాలకులు ఈ విధానాలను వెనక్కి తీసుకునేలా చేయాలి. ఆ దిశగా ప్రతీ ఒక్కరూ ప్రతిఘటించినప్పుడే జరిగే నష్టాన్ని నివారించగలం.

... ... ...

ప్రముఖ ఉర్దూ కథా రచయిత సాదత్ హసన్ మంటో శతజయంతి సంవత్సరం మే 11న ప్రారంభమయ్యింది. సమాజంలోని రుగ్మతలని, మనుషుల్లోని భిన్న మనస్తత్వాలని తన కథలలో శక్తివంతంగా మంటో చిత్రించారు. దేశ విభజన కాలంలో ఇరుదేశాల మధ్య ఏర్పడిన సంఘర్షణలను తన కథలలో సజీవంగా దృశ్యీకరించారు. శతజయంతి సందర్భంగా ఈ సంచికలో మంటోపై వ్యాసంతో పాటు ఒక కథను కూడా ప్రచురించాం. సాదత్ హసన్ మంటోకి సాహిత్య ప్రస్థానం శతజయంతి నివాళి అర్పిస్తున్నది. శతజయంతి ఉత్సవాలు జరపాలని పిలుపునిస్తున్నది.

బొమ్మలు : చంద్ర, శివాజి, వెంకటేష్

ఈ సంచికలో...



సంపాదకవర్గం
తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వొర ప్రసాద్
వల్లభాపురం జనార్ధన
కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
Prasthanam_ss@yahoo.co.in
www.prasthanam.com

కథ

# దోషఫలితం

- పాలకొల్లు రామలింగస్వామి



**నేనొక లవణ రేణువును.. పరిమితంగా వాడినంతకాలం... షడ్రసోపేత జీవితానికి మూలాన్నవుతాను! అపరిమితంగా నన్ను గ్రహిస్తే మాత్రం... జీవచ్ఛవ మనుగడకు మార్గాన్నవుతాను!**

...

"మిస్టర్ చైతన్య... సెవెన్త్ క్లాస్ ఫ్రమ్ అరవింద్ పబ్లిక్ స్కూల్.."

సౌండ్ సిస్టమ్ నుంచి వచ్చిన గంభీర స్వరంతో ఆడిటోరియం ఖంగుమంది. ఎదురుగా ఎత్తయిన వేదిక. దాని దిగువున ఆడియన్స్ గాలరీలో కూర్చుని వున్న చైతన్య లేచి తల్లి శ్రావణి వైపు గర్వంగా చూసేడు.

"ఆల్ ది బెస్ట్!" మందస్మిత వదనంతో అందామె తన కుడిచేతి బొటనవ్రేలిని విజయ సంకేతంగా పైకెత్తి చూపిస్తూ..

"వాకర్స్ క్లబ్ ఇంటర్నేషనల్ ఆధ్వర్యంలో పాఠశాల విద్యార్థులకు వక్తృత్వ పోటీ అంశం. 'క్రీడలు – ప్రాధాన్యత' అన్న బేనర్ న్యాయనిర్ణేతల వెనుకన రెపరెపలాడుతోంది. మైకు ముందుకు వచ్చిన చైతన్యకు బెరుకుగా ఉంది. అతన్లో పరివ్యాప్తమై వున్న నాకు అంతకంటే ఉత్కంఠగా వుంది. ముందుగా స్వపరిచయం చేసుకుని ప్రసంగాన్ని ప్రారంభించేడతను. 'క్రీడలు అనగా ఆటలు. మనకు శారీరకారోగ్యాన్ని కాక మానసిక వికాసాన్ని కూడా కలిగిస్తాయి. శారీరక శ్రమతో కూడుకున్నవి కొన్నయితే మానసిక పరిశ్రమతో కూడుకున్నవి మరికొన్ని. ఈ రెండింటి ద్వారా మనలో చురుకుదనం కలిగి తద్వారా వ్యక్తిత్వ వికాసం కలుగుతుంది. అందుచేత మనిషికీ ఆటలకీ అవినాభావ సంబంధం ఉంది..."

సన్నని జల్లులా... సాగుతోన్న అతని భావ పరంపర క్రమేపి జడివానలా ఊపందుకోబోతున్న తరుణంలో... అప్పుడు జరిగిందది.

అతని శరీరంలో సన్నని కంపన... తడబడుతోన్న మాట... ఏదో మర్చిపోయినవాడిలా పదాల్ని వెదుక్కుంటోన్న పరిస్థితి... ఒకటి.. రెండు... మూడు నిమిషాలు గడిచేయి. నిర్వాహకులు.. తర్వాత పేరు పిలిచారు. శ్రావణికి తల తీసేసినట్లయింది. నాలో చెప్పలేనంత సంతోషం... లక్ష్య సాధన దిశగా సాగుతోన్న నా ప్రస్థానం నాకెంతో స్థైర్యాన్నిచ్చింది.

వేదిక దిగీ దిగగానే... చైతన్య పరుగులాంటి నడకతో తల్లి ఒడిలో తలవాల్చాడు. "ఏడవకు చైతూ... బి బ్రేవ్!... లేచి కళ్ళు తుడుచుకో!"

ఏడుస్తోన్న కొడుకును ఓదార్చి ఇంటికి తీసుకువచ్చిందామె.

పెళ్ళయిన ఏడేళ్ళకు కలిగిన ఏకైక సంతానం చైతన్య... ఇటు పాఠ్యాలలోనే కాదు అటు సహ పాఠ్య కార్యక్రమాల్లో కూడా కొడుకుని అగ్రగామిగా తీర్చిదిద్దాలనేది ఆమె తపన. ఈ రోజు ప్రసంగ వ్యాసాన్ని దగ్గరుండి తయారు చేయించడమే కాక ప్రదర్శనాతీరుపై కూడా తగిన తర్ఫీదును ఇచ్చిందామె.

ఎందుకో ఆమె కృషి సఫలం కాలేదు. కొడుకు కంటే తల్లే ఎక్కువగా బాధపడింది. "ఏంటో మమ్మీ... ఎంతో చెప్పాలని ఉత్సాహంగా స్టేజి మీదకు వెళ్తానా... సడెన్‌గా ఏమవుతుందో గాని నేర్పించిందంతా మర్చిపోతాను. ఎంత ఆలోచించినా గుర్తు రాదు. మాట్లాడుతున్నపుడు ఎవరో నన్ను చూసి నవ్వుతున్నట్టు... కామెంట్ చేస్తున్నట్టు.. అనిపిస్తుంది. మరింకేం తోచదు. ఎంత తొందరగా స్టేజి దిగిపోదామా అని అనిపిస్తుంది. ఎంత కంట్రోల్ చేసుకుందామన్నా నా వల్ల కావడం లేదు మమ్మీ..."

నిజాయితీగా తన సమస్యని ఏకరువు పెట్టేడు చైతన్య. దీర్ఘాలోచనలో పడింది తల్లి. కొడుకు సమస్యని అధిగమించే మార్గమేమిటో ఆమెకు అంతుచిక్కడం లేదు. "నీవన్నీ అర్థంలేని ఆలోచనలు నాన్నా. ముందు నీలోని భయాన్ని తొలగించుకో. ప్రసంగానికి రెండు నిమిషాల ముందు మనసుని ప్రశాంతంగా ఉంచుకో. దేని గురించీ టెన్షన్ ఫీలవకు. రిలాక్స్‌డ్‌గా ఉండాలి. నీ ముందు ఎవరూ లేరనుకుని ప్రసంగాన్ని ప్రారంభించు. అనవసరంగా ఆందోళన చెందడం అర్థరహితం" అంది తల్లి.

తల్లీ కొడుకుల సంభాషణ నాకు వినిపిస్తూనే వుంది. మరింత ఆసక్తి ఎక్కువైంది నాలో. "ఏంటో మమ్మీ! నువ్వు చెప్పినప్పుడు ఎంతో బాగుంటుంది. కాని ఆచరణలోనే... ఫెయిలవుతున్నా" బేలగా అన్నాడు చైతన్య.

"భయపడకు చైతూ...! ధైర్యే సాహసే లక్ష్మీ!' అన్నారు పెద్దలు. అది గుర్తుంచుకో. నాలోనైనా, మీ డాడీలోనైనా ఇటువంటి భయాలేవైనా చూసేవా?... మాలో లేని భయాలు నీలో ఇంత చిన్న వయసు నుంచే ఎలా వొచ్చేయిరా నాయనా!" నిరసిస్తోన్న ధోరణిలో అసహనంగా అంది శ్రావణి. అయోమయంగా చూసేడు చైతన్య. ఆమె మాటలకు నాకు నవ్వొచ్చింది. పడీపడీమని... దిక్కులు పిక్కటిల్లేలా... అలా నవ్వుతూ చాలాసేపు ఉండిపోయాను. ఆమె అమాయకత్వానికి ఎంత ప్రయత్నించినా నాకు నవ్వాగలేదు.

నా వికృత వికటాట్టహాసం మీక్కాస్త చికాకనిపించిందా? అయితే నా నవ్వుకు గల కారణాలు మీకిక్కడ తెలియాలి.... పనిలో పనిగా నా గురించి కూడా కొంతైనా మీతో చెప్పుకోవాలి.

. . .

చైతన్యకు సరిగ్గా మూడో సంవత్సరం... బుడి బుడి నడకలతో.. వచ్చీరాని మాటలతో... తనకు నచ్చింది చేస్తూ... నచ్చనిది పాడు చేస్తూ... ఒక్కోసారి చిరాకు తెప్పిస్తూ... ఇంకోసారి ముద్దులొలికిస్తూ... ఎంతో ఉత్సాహంగా ఉండేవాడు.

ఒకసారి... బయట లాన్‌లో కూర్చుని... తనొక్కడే ఆడుకుంటున్నపుడు... తన పక్క నుంచి చరా చరా పాకిపోయింది పాము. ఆ దృశ్యాన్ని చైతన్య కళ్ళప్పగించి ఆశ్చర్యంగా చూసాడే తప్ప ఏమాత్రం తొణకలేదు, బెణకలేదు. వాడికింకా అప్పటికి ఏం తెలీదు. నేనెవరో అంతకన్నా తెలీదు. తెలుసుకోవాలనే కుతూహలమే వాడికుండదు.

"నువ్వు అట్టే అల్లరిచేస్తే... నిన్ను ఆ బూచాడికిచ్చేస్తాను."

"అటువైపు వెళ్ళకమ్మా... దెయ్యముందక్కడ... చంపేస్తుందిలే... నాకేం!?"

ఇలా లేనిపోని బెదిరింపులతో కన్నవారే నన్ను తమ పిల్లల్లో ప్రవేశపెడతారు.

వాడితో పాటు...నేనూ పెరుగుతూ వస్తాను. నాదంటూ రూపమేదీ ఉండదు.



అయినా పలు సందర్భాల్లో మనిషిలో ఆవిష్కృతమవుతూనే ఉంటాను.

నాకో తోబుట్టువు ఉన్నాడు. నాకంటే చాలా ప్రమాదకారి. మేమిద్దరం ఒకే మనిషిలో జత కలిశామో ఇక సర్వనాశనమే.

మనిషి... ఏళ్ళు మళ్ళి పెద్దవాడైనప్పటికీ నలుగురిలోకి చొరవగా వెళ్ళలేడు. వెళ్ళినా తనని తాను సమర్థవంతంగా ప్రెజెంట్ చేసుకోలేడు. ఎందుకంటే నేను అతనికి గుర్తొస్తాను. ఎవరైనా కొత్త వ్యక్తితో సంబంధాల్ని నెరపడానికైనా... ముందుకు రాలేడు. కారణం అతన్లో సదా నేను మెదుల్తుంటాను.

ఇక అక్కడ్నుంచే... మనిషి తనలో తాను కుచించుకుపోతాడు గొంగళిపురుగులా..! ఇంట్లోని తండ్రి మాటన్నా... స్కూల్లో లెక్కల మాష్టారన్నా.. బజార్లోకి వెళ్ళి సరుకులు కొనాలన్నా.. అపోజిట్ సెక్స్‌తో మాట్లాడాలన్నా...ఎత్తయిన బిల్డింగ్ నుంచి కిందకు చూడాలన్నా.. కుక్కను చూసినా... కప్పను చూసినా... ఆఖరికి బల్లిని చూసినా... అతనికి భయమే!

నిజానికి వాటి వలన హాని కలగడం, కలగకపోవడం అటుంచి, వాడిలో గూడు కట్టుకున్న నా భావన వాడినలా తయారయ్యేలా చేస్తుంది. ఒక్కోసారి ప్రమాదం కంటే ముందే ప్రాణాలు పోయిన సందర్భాలు ఉన్నాయంటే అతిశయోక్తి కాదు. అయితే కొంతమంది మాత్రం నన్ను తెలివిగా తొక్కిపెడతారు. వాళ్ళెంత జీవితంలో ఎదిగినప్పటికీ నా కన్నుసన్నల్లో ఆజన్మాంతమూ ఉండక తప్పదు... అది జీవధర్మం!

ఇప్పుడు చెప్పండి... మీ స్వార్థం కోసం నన్ను మీ మధ్యన పెంచి పోషించి ఇప్పుడిలా దోషిని చేసి మాట్లాడటం సరైనదేనా? ఒక్క

తప్పు చేసినపుడు తప్ప మిగతా ఏ సందర్భంలోనూ నన్ను తలంచుకోవద్దనే, మైండ్‌సెట్‌ను ఎప్పుడైనా మీ పిల్లలకు నేర్పారా? ఇవేవి ఆలోచించకుండా అంతలా ఆమె అమాయకంగా మాట్లాడితే నాకు నవ్వురాదా? మీరే చెప్పండి! నా వైపు నుంచి చూస్తే నా భావాలన్నీ సరైనవేనని ఒప్పుకుంటారు. మీరంతా! "ఓస్.. అంతేనా! దానివలన కొంపేం మునిగిపోయిందా?" అని వ్యంగ్యంగా నా మాటల్ని కొట్టిపారేస్తారా... అయితే అతని జీవితంలో మరో పార్శ్వాన్ని తప్పక మీరు చూడాల్సిందే!

. . .

సరిగ్గా ఎనిమిదేళ్ళ తర్వాత... చైతన్య ఇప్పుడు రెండో సంవత్సరం బియస్సీ... పంథొమ్మిదేళ్ళ కుర్రాడైనప్పటికీ శ్రావణి అతన్నింకా ముద్దు చేయడం మానలేదు. అతని స్వభావంలో కూడా చెప్పుకోదగ్గ మార్పేమి లేదు.

"ఏంటండి మేడమ్! మీ వాడినలా నూతిలో కప్పలా పెంచారేంటి? ఈ కాలపు కుర్రాడిలా సరదాగా, హుషారుగా ఎప్పుడూ ఉండడేంటి?!"



అని అడిగిందొకామె శ్రావణిని ఏదో సందర్భంలో. దానికామె నవ్వింది.

"మావాడికేం... బంగారం... లోకజ్ఞానం లేకపోతేనేం.. చదువుంది. పదిమందిలో తిరగక పోతేనేం సంస్కారం ఉంది. సరదాగా ఉండకపోతేనేం మంచి మనస్సుంది. ఒక మనిషికి ఇంతకుమించి ఇంకేం కావాలి?" అని ప్రశ్నించింది. దానికామె మూతి మూడు వంకర్లు తిప్పింది. "మనిషీ, సమాజం రెండూ వేరు కాదు. ఒకటే. సమాజంతో కలసి మెలసి బతకలేని మనిషిలో ఎన్ని సద్గుణాలు ఉండి ఏం లాభం లెండి?!" అని అందామె నిష్కర్షగా ఆమె మాటలకు శ్రావణి మనసు చిన్నబోయింది.

"నేటి సమాజంలో మానవ సంబంధాలన్నీ ఆర్థిక వ్యూహాల చుట్టూ తిరుగుతున్నప్పుడు ఇక ఆ మనిషి సృష్టించిన సంఘంతో పనేముంది? ఒక్క డబ్బుంటే చాలదా?

ఇంకేం కావాలి? అని సూటిగా జవాబిచ్చింది శ్రావణి.

"మీరు చెప్పేది నిజం కావొచ్చు. సమాజంలో డబ్బుతో కొనలేనివి ఇంకా కొన్ని మిగిలే ఉన్నాయన్న వాస్తవాన్ని మీరు ఒప్పుకోవాలి మేడమ్. అది మీకే మంచిది." "మెనీ మెనీ థాంక్స్... మీరిచ్చిన సలహాకు మాత్రమే కాదు. డబ్బుతో కొనగలిగినవి కొన్నైనా ఉన్నాయని మీరు అంగీకరించినందుకు..." అంది శ్రావణి. ఆమె మరేం మాట్లాడలేదు.

కాలం నేర్పాల్సిన పాఠాన్ని ముందుగా మనమే వివరించి ఎందుకు చెడ్డవ్వాలి? అనే ఆలోచనాపరులు ఎక్కువగా ఉన్న నేటి హైటెక్ సొసైటీలో మనిషి ఎవరైనా సరే ఎదుటివారిని ఒప్పించే ప్రయత్నం అనవసరమనే తీర్మానించుకుంటారు. కాని పైకి మాత్రం ఓ వెర్రి నవ్వు మౌనంగా నవ్వి తప్పుకుంటారు. ఆమె కూడా అదే చేసింది. అలా అయిందానికీ కాని దానికీ చైతన్యని వెనకేసుకుని రావడం శ్రావణికి పరిపాటి అయ్యింది.

కొన్నాళ్ళకి... ఎదురింట్లో అద్దెకు దిగిన స్కూలు మాష్టారు గారమ్మాయి కీర్తనను తొలిచూపులోనే పిచ్చిగా ప్రేమించడం మొదలుపెట్టేడు చైతన్య. కాని ఆ విషయాన్ని ముఖస్తంగా ఆమెతో ఎలా చెప్పాలో తెలీక మదనపడుతున్న తరుణంలో... ఆ అవకాశం వెదుక్కొంటూ రానే వచ్చింది.

"మన ఇంట్లో ఉంటున్న కామేశ్వరం గారమ్మాయి కీర్తన లేదూ... ఇంటర్ మేథ్స్‌లో ఆ అమ్మాయికి ఏవో డౌట్సట... వస్తానంటోంది... చెబుతావా?" అని అతన్ని అడిగింది శ్రావణి ఒకరోజు. అంతే! ఎగిరి గంతేసినట్టుగా సంబరపడ్డాడతను. కాని పైకి మాత్రం ఇష్టం లేనట్టుగా ముఖం పెట్టాడు.

"రోజూ ఆమెకు లెక్కలు చెబుతూ కూర్చుంటే ఇక నేనెప్పుడు చదువుకోవాలి?" అని బెట్టు చేసేడు చైతన్య.

"రోజంతా అక్కర్లేదు నాన్న. కనీసం ఒక గంటైనా చెప్పు. లేకపోతే నా మాట పోతుంది'' అని బతిమాలిందావె. సరేనన్నాడతను.

మరుసటి రోజు నుంచి..

ప్రతిరోజూ పుస్తకాల్ని పట్టుకుని కీర్తన వచ్చేది. ఆమె అందం చైతన్యని మంత్రముగ్ధం చేసేది. ఆమె క్రీగంటి చూపుల్లో అతను కోటి భావాల్ని వెదుక్కునేవాడు. కాని ఆమెకు లెక్కల పాఠాలైతే చెప్పగలిగాడు కాని ప్రేమ పాఠాల్ని మాత్రం చెప్పలేకపోయాడు. కారణం... అతనిలో నిక్షిప్తమై వున్న నేను!

తన ప్రేమను ఆమె ముందు వ్యక్తపరచడానికి భయం. ఒకవేళ వ్యక్తీకరిస్తే ఆమె ఎలా స్పందిస్తుందోనని అనుమానం... ఒకవేళ నిరాకరణ ఎదురైతే దాన్ని జీర్ణించుకోగలిగేంత ధైర్యం తనలో ఉందో లేదోనన్న అపనమ్మకం.

వెరసి... అలా... మొగ్గ దశలోనే అతని ప్రేమ రాలిపోయింది.

కొన్నాళ్ళు గడిచాక... ఆమెకు పెళ్ళయి అత్తారింటికి వెళ్ళిపోయింది. ఈలోగా చైతన్య పి.జి. చేశాడు. ఎన్నో కోర్సులు పూర్తి చేశాడు. కాని జీవితంలో స్థిరపడలేకపోయాడు. కొంతకాలానికి... ఏడాదిన్నర పాపను చంకనేసుకుని చుట్టపుచూపుగా కన్నవారింటికి వచ్చింది కీర్తన. వీధి దోవగుండా నడచిపోతున్న చైతన్య కంటపడింది.

"ఏం చైతూ.. ఎలా ఉన్నావ్. బాగున్నావా?" కీర్తనే ముందుగా పలకరించింది. నవ్వుతూ!

"బాగున్నాను.. మరి నువ్వో!?" అనడిగేడతను.

"ఆ... ఏం బాగు..!? అదే బాగు" నిట్టూర్చి అందామె తన పాపను అతనికందిస్తూ.

క్షణకాలం... ఇద్దరి మధ్య మాటరాని మౌనం.. ఏం మాట్లాడాలో తెలీని స్థితి.

"పాప.. .అచ్చం నీ పోలికే సుమా!?" పాపను చూస్తూ అన్నాడతను కాసేపటికి.

బదులుగా నవ్విందామె.

"ఇప్పుడు.. ఏం జేస్తున్నావ్?" అడిగింది కీర్తన.

"పోటీ పరీక్షలు రాస్తున్నా... టెస్టుల్లో పాసు... ఇంటర్వ్యూల్లో ఫెయిలవుతున్నా..."

"ఏం.. ఎందుకని?"

"ఏముంది... చిన్నప్పట్నుంచి ఉన్నదేగా... ఫియర్ కాంప్లెక్స్."

"నిన్నింకా ఆ ముదనష్టపు జబ్బు వదల్లేదన్నమాట. మరింకేం? ఈ జన్మలో బాగుపడ్డట్టే!"

ఆమె దెప్పిపొడుపు మాటలకు చిన్నబుచ్చుకున్నాడు చైతన్యం.

"ఇదేం బాగోలేదు కీర్తన. నువ్వు కూడా నాదే తప్పంటావా?" అన్నాడు చైతన్య.

"లేకపోతే... ఆ రోజుల్లో నీ దగ్గరకు ట్యూషన్స్‌కని వచ్చినప్పుడు నీకెన్ని అవకాశాలు ఇచ్చాను? "

ఒకసారి గుర్తు తెచ్చుకో. ఏ క్షణమైనా 'ఐ లవ్ యు' చెబుతావేమోనని ఆశించాను.



కాని నువ్వేం చేశావు? వట్టి చూపులతో సరిపెట్టేశావు. నువ్వప్పుడు ధైర్యం చేసి వుంటే నీకీపాటికి భార్యనయ్యే దాన్ని కాదూ.." అని నిష్ఠూరమాడిందామె.

"సారీ కీర్తన... రియల్లీ ఐ మిస్ యు!" తలదించుకుని వేదనగా అన్నాడతను.

"నాకెందుకు సారీ... అదేదో నీకు నువ్వు చెప్పుకో. నువ్వొక చవట సన్నాసివి. ఇంకెప్పుడు నీ మొహం చూపించకు. వెళ్ళిక్కడ్నుంచి!" అని అందామె కోపంగా. అంతేగాక అతని చేతుల్లోని పాపను లాక్కుంది. గబగబా లోపలకు వెళ్ళి ధడేల్మని తలుపు వేసుకుంది కీర్తన.

నిజం చెప్పొద్దూ... నాక్కూడా కొంచెం చివుక్కుమనిపించింది. అది లగాయతు మానసికంగా ఎంతో దెబ్బతిన్నాడు చైతన్య. రోజూ అవే ఆలోచనలతో అతను మామూలు మనిషి కాలేకపోయాడు. అతని భవిష్యత్ పూర్తిగా దెబ్బతింది. మరోవైపున ముంచుకొచ్చిన వయో పరిమితి అతని ఉద్యోగావకాశాల్ని దూరం చేసింది.

ఈ పరిణామాలన్నీ నన్నే విజేతను చేసి... విజయగర్వంతో పులకించేలా చేశాయి.

. . .

విధిలేక... తన విద్యార్హత సర్టిఫికెట్లతో బ్యాంక్ లోనుకు అప్లై చేశాడు కొన్నాళ్ళకి చైతన్య. బ్యాంక్ లోనుకు... తన తల్లి ఇచ్చిన మొత్తాన్ని కొంత జత చేసి అట్టహాసంగా ఓ డిపార్ట్‌మెంట్ స్టోర్‌ను ప్రారంభించాడు. బాగానే నడుస్తోందది.

షాపు పెట్టిన ఏడాదికి అతనో ఇంటివాడయ్యాడు. ఆమె పేరు రమణి. ఇంటర్ చదివింది. అతనికంటే తెలివైంది. చురుకైంది కూడా!

మరో ఏడాదికి పిల్లాడు పుట్టాడు. వాడికిప్పుడు మూడేళ్ళు. పేరు కార్తీక్.

పెళ్ళయిన కొత్తల్లో అతని ప్రవర్తన ఆమెకు వింతగా అనిపించింది. కొద్దిరోజులకి అలవాటైంది. ఆపై మూడేళ్ళ కాల పరిమితిలో ఒక అంచనాకు వచ్చింది.

అతనికి స్నేహితులు లేరు. ఉన్నా పెద్దగా పట్టించుకోడు. ప్రతి దానికీ తీవ్ర ఆందోళన చెందడం... ఎప్పుడు చూసినా పరధ్యానం... బలహీనంగా... తడబడుతూ మాట్లాడ్డం..

ఇవన్నీ... ఆమె పరిశోధనలో తేలిన అతని లక్షణాలు..

వాటన్నిటినీ శ్రావణి దగ్గర కదిపింది రమణి. అంతేగాక..

"అత్తయ్యా... మీ అబ్బాయి ప్రవర్తన చిన్నప్పట్నుంచి ఇంతేనా?!" అని ఆమె నడిగింది.

"ఏమ్మా... ఎందుకలా అడిగావు?"

"అతని ప్రవర్తన ఎప్పుడూ అసహజంగా అనిపించలేదా?"

"అయితే.. ఏం!?"

"అవన్నీ డాక్టర్‌కు చూపించాల్సిన సమస్యలని అనిపించలేదా?"

దానికామె వ్యంగ్యంగా నవ్వింది.

"అబ్బే... అవన్నీ వట్టి భ్రమలేనమ్మా... ఆ అవసరం లేదు" అని తేలిగ్గా తీసిపారేసింది.

"లేదత్తయ్యా... మీ ఆలోచన సరికాదు. మీ అబ్బాయికి ఉన్నది ఒక రకమైన సమస్య. అది ముదిరిపోక మునుపే నయం చేయించాలి. లేకపోతే ప్రమాదం. అందుకని డాక్టర్‌గారి దగ్గరకు తీసుకెళదామనుకుంటున్నా" అని అంది రమణి. ఒప్పుకోక తప్పింది కాదు అత్తగారికి.

"సరేనమ్మా... నీ ఇష్టం" అని గ్రీన్‌సిగ్నల్ ఇచ్చేసిందామె.

. . .

మరుసటి రోజున... నగరంలోని ఓ ప్రముఖ సైక్రియాటిస్ట్ దగ్గర అపాయింట్‌మెంట్ తీసుకుంది. భర్తతో కలిసి వెళ్ళి అతని సమస్యలన్నింటిని డాక్టర్‌గారికి వివరించి చెప్పింది రమణి.. అతనిలో చిరకాల సహవాసినైన నేను కూడా ఆశ్చర్యంతో దిమ్మతిరిగేలా వివరించిందామె.

"అబ్జర్వేషన్ రూమ్"లో అతన్ని పరీక్షించి తిరిగొచ్చేడు డాక్టర్.

"మీవారి సమస్యను ఎంగ్జయిటీ న్యూరోసిస్ అంటారమ్మా. ఇట్స్ వెరీ సింపుల్. 'బిహేవియర్ థెరపీ'తో దాన్ని సరిచేయవచ్చు" రమణితో అన్నాడతను తాపీగా.

"సరే డాక్టర్.. మావారు అందరిలాగా మామూలు మనిషిలా మారతారా సార్?"

అమాయకంగా అంది రమణి.

"డోంట్ వర్రీ... ఐ విల్ ట్రై మె లెవల్ బెస్ట్" నెక్ట్ విజిట్ నుంచి మన ప్రాసెస్‌ను ప్రారంభిద్దాం." అన్నాడు డాక్టర్.

"సర్.. నాదొక మాట. ఈ సమస్యను అధిగమించడం మన చేతుల్లో ఉందా డాక్టర్?" అందామె.

"గుడ్.. చాలా మంచి ప్రశ్న. బాల్య దశలో ఉన్నప్పుడు మీ పిల్లలకు అర్థంలేని భయాల్ని పరిచయం చేయకండి. స్వేచ్ఛగా పెరగనివ్వండి. మీ గారాబాన్ని మితంగానే చూపండి. అతి వలన మీ పిల్లల్లో 'ఓవర్ సెన్సిటివ్‌నెస్' డెవలప్ అయ్యే ప్రమాదం ఉంది. అది మంచిది కాదు. ఒక వ్యక్తి పట్ల భక్తిగా ఉండటమంటే భయంగా మసలుకోవడమేనని అనుకుంటారు చాలామంది. కాని అది తప్పు. భక్తికీ, భయానికీ మధ్య గల సన్నటి రేఖను మీ పిల్లలు గుర్తెరిగేలా చేయండి. మనలోని ప్రతి భయానికీ ఒక్కో పరిష్కారం ఉంటుందని చెప్పండి. చిన్నప్పట్నుంచి గుంపు మనస్తత్వాన్ని అలవాటు చేయండి. సాధ్యమైనంతవరకు ఒంటరిగా పెరగనివ్వకండి. చిన్నప్పుడే ఎటువంటి అవలక్షణాలు కనిపించినా దాన్ని సానుకూలంగా సరిదిద్దే ప్రయత్నం చేయండి. తాత్సారం చేయకండి.." అన్నాడు డాక్టర్.

అతని వివరణ వాళ్ళకే కాదు.. నాకూ ఆసక్తికరమనిపించింది.

మనిషిపై నా ప్రభావ ఫలితాన్ని ఓ అస్త్రంగా మలచి పరిశోధించినందుకు ఒకవైపు గర్వం.. దాన్నిలా కౌన్సిలింగ్ పేరిట సొమ్ము చేసుకుంటున్నందుకు మరోవైపు కోపం కలిగేయి.

క్లినిక్ నుంచి బయటపడి ఇంటికి బయల్దేరారు భార్యాభర్తలిద్దరు. బస్సెక్కారు. సీట్లలో కూర్చున్నప్పటికీ డాక్టర్ చెప్పిన విషయాలే అతనిలో మాటిమాటికీ గుర్తొస్తున్నాయి. స్టేజి రాగానే బస్సు దిగి రోడ్డుపై నడుస్తున్నారు ఇద్దరు.

"డాక్టర్‌గారు... చెప్పింది విన్నాక మీకేమనిపించింది?" అడిగింది భర్తను రమణి.

"బాగుంది... పిల్లలున్న ప్రతి పేరెంట్ తప్పక తెలుసుకోవాలి అవన్నీ" అన్నాడు చైతన్య.

"భారతీయ తత్వవేత్త అయిన స్వామి వివేకానంద ఈ నిర్ణయం గురించి ఏమన్నారో తెల్సా?"

"తెలీదు"

"భయం గల వ్యక్తి ఏం సాధించలేడని అన్నారు. అంతేకాదు మరో ఫిలాసఫరైన బెర్ట్రండ్ రస్సెల్ కూడా భయాన్ని అధిగమించడం జ్ఞాన సముపార్జనకు తొలిమెట్టని అన్నాడు. దీన్నిబట్టి 'ధైర్యమంటే' పురోగమనమని, భయమంటే తిరోగమనమనీ మనకు అర్థమవుతుంది కదూ!" అంది రమణి. మరేం మాట్లాడలేదు చైతన్య.

ఇల్లు రాగానే గేటు తీసి ఇంట్లోకి ప్రవేశించబోయి క్షణకాలం ఆగారు భార్యాభర్తలు.

ఎక్కడి నుంచి వచ్చిందో గాని ఓ కుక్క... ద్వారబంధం దాటి బయటకు నడుచుకుంటూ అట్నుంచి వస్తున్న మూడేళ్ళ కార్తిక్‌కు ఎదురుపడింది.

కుక్క... కార్తీక్ ఒకరికొకరు ఎదురెదురుగా అలా కొన్ని సెకన్లపాటు చూస్తుండటంతో దంపతులిద్దరిలో ఆదుర్దా పెరిగింది.

"ఛెయ్... ఛెయ్!" చేతిని ముందుకు అదిలిస్తూ అన్నాడా కుర్రాడు.

"భౌ... భౌ!" ఆ కుక్క అలాగే నిలబడి గట్టిగా మొరిగింది.

''బాబును... కుక్క కరిచేస్తుందేమో?!' అడుగు ముందుకు వేయబోతూ ఆందోళనగా అన్నాడు చైతన్య. చేత్తో వెనక్కి లాగిందతన్ని రమణి.

"మీరుండండి... గాభరా పడకండి.' ఆమె అనడంతో అతను ఆగాడు.

"ఛెయ్.. ఛెయ్!" రెండోసారి గట్టిగా అన్నాడు కార్తీక్.

ఆ కుక్క అటూ ఇటూ నిశ్శబ్దంగా చూసి వెనుదిరిగి బయటకు తుర్రుమంది.

"హమ్మయ్య! కొడుకుని మురిపెంగా ఎత్తుకుని హాయిగా ఊపిరి పీల్చుకున్నారు భార్యాభర్తలు. లోపల్నుంచి బయటకు వచ్చిన శ్రావణి కూడా వారి ఆనందంలో పాలుపంచుకుంది.

"ఇక నుంచి.. కార్తీక్‌ను ఇందాక డాక్టర్‌గారు చెప్పినట్టుగా పెంచుదాం. ఏమంటావు?'' అన్నాడు చైతన్య స్థిరంగా. అభినందనపూర్వకంగా భర్త వేపు చూసింది రమణి.

. . .

నా విధిలో భాగంగా... కార్తీక్‌ను ఆశ్రయించాలని తగిన అవకాశం కోసం గత కొన్నేళ్ళుగా అతని చుట్టూ పరిభ్రమిస్తున్న నాకు పై సంఘటన ఒకింత నిరాశనే మిగిల్చింది. నా ఆటలిక సాగేలా లేవు' తప్పదు.

మరో దేహాన్ని వెదుక్కోవాల్సిందే!

ఆ క్షణం నుంచే... అంతులేని ఆత్మవిశ్వాసంతో నా అన్వేషణ మొదలైంది... దిక్కులే హద్దుగా!

**సెల్ : 9441416049**

# కాలానికి ఎదురీది

- డా॥ సి. నారాయణరెడ్డి

కాలం కన్నెర్రజేస్తే
మండుటెండలు ధగధగలాడుతాయి
ఆ కాలమే
ప్రసన్న దృష్టితో చూస్తే
పండువెన్నెలలు నిగనిగలాడుతాయి
కాలం లోతులు
సముద్రాలకు అంతుపట్టనివి
దాని ఎత్తులు
హిమాలయాలు వెయ్యింతలు పెరిగినా
అందుకోలేనివి
కాలం సూటిగా ప్రశ్నిస్తే
సమాధానాలు దారి తప్పిపోతాయి
అదే మౌనంగా ఉంటే
సమస్త ప్రకృతి మూగవడిపోతుంది



భూగోళం గిర్రున తిరుగుతూ వుంటే
దాని మీద నివసించే ప్రాణులు
పడిపోకుండా చూసేది కాలమే

తన మతి భ్రమిస్తే
సకల ప్రాణులను
అకస్మాత్తుగా
కంపింపచేసేది కాలమే
కాలస్వరూపం
ఏ నిర్వచనాల కందనిది
స్థిరమా? చరమా?
చరాచర సృష్టి సర్వం
కాలానికి ప్రతిబింబమే
కాలాధీనులు కాని మనుషులు
చేయవలసిందేమిటి?
తరగలెత్తే కాలం మీద
నిర్లిప్తంగా తేలిపోవడం
దాని ప్రవాహ గతులు విషమిస్తే
తట్టుకుని ఎదురీది
జీవితం చివరి అంచును
చేరుకోవడం

---

# అనుబంధ సౌరభం

- కోపూరి పుష్పాదేవి
సెల్ : 9440766375

అనురాగం అనే ఎరువు వేసి
ప్రేమ చేనులో
పండించవలసిన పంట అనుబంధం
ద్వేషపు చీడను
ఆప్యాయతల మందుతో అణచివేసి
అభిమాన జలంతో
పెంచవలసిన మొక్క అనుబంధం
పంచే కొద్దీ పెరిగేవి అనుబంధాలు
పెరిగి పెరిగి పరిమళించేవి బాంధవ్యాలు
అనుబంధాల విరులు
అయినవారి మధ్యే విరబూస్తాయనడం
కానేకాదు నిజం



నిజంగా ఇది నిజం
మహాత్ముని సత్యాగ్రహం
రక్త సంబంధీకుల కోసం కాదు
మదర్ థెరీసా మహోన్నత సేవలు
అయిన వారి కోసమే కాదు
వివేకానందుని విజ్ఞాన వీచికలు
విశ్వమంతా పరిమళించాయి
అనుబంధ పుష్ప సౌరభాన్ని
ఆస్వాదించిన మనసు
చెడు తలపుల తలుపు మూసేస్తుంది
విశ్వానికి
వెన్నెల వాకిలి తెరుస్తుంది






# ఉన్నవవారి 'మాలపల్లి' ప్రేమ్‌చంద్ 'రంగ్‌భూమి' నవలల తులనాత్మక పరిచయం






- డా॥ పేరిశెట్టి శ్రీనివాసరావు

'దేశభక్త' ఉన్నవ లక్ష్మీనారాయణ యొక్క సమయం ఆశ్చర్యకరంగా హిందీ నవలా సామ్రాట్ 'ప్రేమ్‌చంద్' యొక్క సమయంతో సరితూగుతున్నది. ప్రేమ్‌చంద్ మరియు ఉన్నవ లక్ష్మీనారాయణలు ఇరువురూ తమ నవలా సాహిత్యం ద్వారా భారతీయ నవ జాగరణ ఉద్యమం మరియు సంఘ సంస్కరణలను సామాన్య ప్రజానీకం వరకూ చేరవేసే కార్యక్రమాలను చేపట్టారు. ప్రస్తుత హిందీ సాహితీ విమర్శకులలో అగ్రగణ్యులైన డా॥ నామ్‌వర్‌సింగ్ ఇలా అన్నారు. "భారతీయ నవలపై పాశ్చాత్య దేశాల నవలా ప్రభావం వున్నది. అది పాశ్చాత్య నవలను అనుకరిస్తుందనే సిద్ధాంతం మౌలికంగా తప్పు. ఎందుకంటే 'భారతీయ నవల' పాశ్చాత్య దేశాల నవలలాగ మధ్యతరగతి పాఠకుల 'మహా కావ్యం'గా ఉద్భవించలేదు కానీ అది నవజాగరణ ఉద్యమ గర్భం నుండి ఆవిర్భవించింది." దీనికి ముఖ్య కారణం మన మొట్టమొదటి నవలా రచయితలు తమ కథా వస్తువుగా గ్రామాలను ఎంచుకోవడం మరియు సామాజిక మార్పు ద్వారా రాజకీయ మార్పు, చైతన్యాలను తీసుకొనివచ్చే ప్రయత్నం. ఇక్కడ ముఖ్య ఉద్దేశం ఏమిటంటే హిందీలో ప్రేమ్‌చంద్ కాని, తెలుగులో ఉన్నవ లక్ష్మీనారాయణ కాని – ఇరువురి దృష్టి గ్రామ కేంద్రితమై ఉన్నది. పేద ప్రజల సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక బానిసత్వమే కేంద్రీకృతమై ఉన్నది. వీరివురి ప్రగాఢమైన విశ్వాసం ఏమనగా నిరక్షరాస్యత, వెనుకబడినతనము, మూఢనమ్మకాలు మొదలైన వాటి నుండి భారతదేశపు గ్రామీణ ప్రజలు స్వతంత్రులు కాగలిగితే రాజకీయ స్వాతంత్ర్యం దానంతట అదే వస్తుంది. అందుకే ఉన్నవ లక్ష్మీనారాయణ తన నవల 'మాలపల్లి'లో రాందాసు, సంగదాసులను సామాజిక మార్పునకు ప్రతీకలుగా తీర్చిదిద్దారు. అదేవిధంగా ప్రేమ్‌చంద్ తన 'రంగ్‌భూమి'లో సమాజంలోని రకరకాల అన్యాయాలను ఆత్మబలంతో ఎదుర్కొనే ఒక ధైర్యవంతుడైన, ధీరుడైన నాయకుడిగా "సూరదాస్" అనే పాత్రను సృష్టించాడు. హిందీ సాహిత్యంలో గ్రామీణ వాతావరణంతో కూడిన అనేక నవలలు (ప్రేమ్‌చంద్‌వి కాకుండా) వచ్చినవి. ముఖ్యంగా 'శివపూజన్ సహాయ్' యొక్క 'దేహతీ దునియా'తో ఈ పరంపర ప్రారంభమవుతుంది.

ఈ వరుస క్రమంలో 'బలచనమా' (నాగార్జున్), 'మైలాఅంచల్', 'పరతీ పరికథా' (ఫణీశ్వర్‌నాథ్ రేణు), 'అలగ్ అలగ్ వైతరణీ (శివప్రసాద్‌సింగ్), 'ఆధాగాంవ్ (రాహీ మసూమ్ రజా), 'పానీ కే ప్రాచీర్', 'జల్ టూట్‌తా హువా' (రాందరశ్‌మిశ్రా), 'రాగ్‌దర్‌బారీ' (శ్రీలాల్‌శుక్ల) పైన పేర్కొన్న పరంపరను పరిపుష్ట పరిచినవిగా పేర్కొనవచ్చు. పైన పేర్కొన్న నవలా సాహిత్యం, నవలా రచయితలు కూడా ప్రేమ్‌చంద్‌కి, 'ఉన్నవ'కి రుణపడినవారే! ఎందుకంటే ఈ ఇరువురూ కూడా హిందీ, తెలుగు నవలను 'మధ్యతరగతి మహాకావ్యం'గా తీర్చిదిద్దడంలో సమకాలీన యుగపురుషుడైన 'మహాత్మాగాంధీ' సిద్ధాంతాలను తమ కావ్యాలలో ప్రతిఫలింపచేశారు.

ఇక్కడ గుర్తుంచుకోవలసిన మరొక అంశం ఏమిటంటే వీరి తర్వాత వచ్చిన నవలా రచయితలు ఎవరైతే ఉన్నారో వారు 'సమకాలీనత' ఎడల వారి ఆఖరి ప్రతిస్పందన నిరాశకి గురిచేస్తుంది. ఒకరకమైన నైరాశ్య ప్రభావాన్ని చూపుతుంది. "లేదు, గ్రామాల స్థితిగతులు ఎన్నటికీ మారవు. ఇవి ఇంకా ఇంకా నాశనమైపోతాయి. వీటిని 'వైద్యం లేనటువంటి రోగులుగా" భావించి నగరం వైపు పారిపో..! అక్కడే నీకు మంచి జరుగుతుంది." అందువల్లే 'రాగ్‌దర్‌బారీ' నవలలో 'రంగ్‌నాథ్' గ్రామం నుండి నగరానికి తిరిగి వెళ్ళిపోతాడు.

నిజానికి చెప్పాలంటే పల్లెలను మార్చాలంటే ఎవరో 'పట్నం' నుండి వచ్చి 'పల్లె'ను మార్చలేరు. వాటిని వారే మార్చగలరు. ఎవరైతే గ్రామాలలో పుడతారో, ఎవరికైతే ఆ మట్టిపై మమకారం ఉంటుందో, ఎవరైతే గ్రామ ప్రజలను ప్రేమిస్తారో, ఎవరికైతే గ్రామ పద్ధతులపై ధ్యాస ఉంటుందో లేదా జీవితపు విలువలకు మూలాధారం గ్రామీణ జీవనమని నమ్ముతారో వారు మాత్రమే మార్చగలరు.

ప్రేమ్‌చంద్ 'రంగ్‌భూమి' నాయకుడి పాత్ర సూర్‌దాస్ శుద్ధమైన, అచ్చమైన గ్రామీణ పంట. అంతే స్వచ్ఛమైనపాత్రలు 'ఉన్నవ' వారి 'మాలపల్లి' లోని రాందాస్ మరియు సంగదాసు పాత్రలు. వీటి ద్వారా ఇరువురూ కూడా అంటే ప్రేమ్‌చంద్, ఉన్నవ లక్ష్మీనారాయణ గాంధేయవాదాన్ని, ఆలోచనా తత్వాన్ని తమ నవలలో ప్రవేశపెట్టారని

చెప్పవచ్చు. నిజానికి వీరిరువురికి కూడా ప్రేరణ మాత్రం గాంధీ 'హింద్ స్వరాజ్' నుండి లభించిందని చెప్పుకోవచ్చు.

**క్రింది ఉదాహరణే తార్కాణం :**

'రంగ్‌భూమి'లో సూరదాస్ తన గ్రామంలో పొగాకు ఫ్యాక్టరీ నిర్మాణాన్ని నిరోధించినా లేక 'మాలపల్లి'లో రాందాసు తన గ్రామంలోని వెనుకబడిన లేదా తన సామాజిక వర్గ ప్రజల దశను ఉద్ధరించడానికై చేసిన ప్రయత్నాలు. వీరిరువురి క్రియా కలాపాలు హింద్ స్వరాజ్ సంకల్పానికి ప్రతీకలుగా భావించవచ్చు. ప్రేమ్‌చంద్, ఉన్నవ లక్ష్మీనారాయణ ఇరువురూ తమ నవలల ద్వారా సమాజంలోని దుర్గుణాలను సమీక్షించి నూతన విలువల సహాయంతో మార్పునకు శ్రీకారం చుట్టారు.

## 'ఉన్నవ వారి 'మాలపల్లి'

'మాలపల్లి'లో రైతులకు, జమిందారులకు (చౌదరయ్య ఇతరులు) మధ్య ఘర్షణ జరుగుతుంది. మాలపల్లి గురించి సంక్షిప్తంగా చెప్పాలంటే – మంగళాపురం గ్రామంలో 'మాలపల్లి'కి నాయకుడు రాందాసు. మాల కులస్థుడైనప్పటికిని విద్యావంతుడు, స్థితప్రజ్ఞుడు. రాందాసు తన కష్టంతో నాలుగైదు ఎకరాల భూమి సాగుచేసుకుంటున్నాడు. పెద్ద కుటుంబం, కుటుంబానికి తగ్గ బాధ్యతలు – ఆ గ్రామంలో రాందాసుతో పాటు చౌదరయ్య కుటుంబాన్ని కూడా చిత్రీకరించారు 'ఉన్నవ' . చౌదరయ్య క్రూరుడు మరియు లోభి. భార్య లక్ష్మమ్మ సౌశీల్యవతి. రాందాసు తన సామాజిక వర్గమైన హరిజనుల ఉద్ధరణకై నిరంతరం ప్రయత్నిస్తుంటాడు. ఆయన ఉద్దేశ్యంలో గ్రామీణ ప్రజల దురవస్థకు ముఖ్యంగా రెండు ప్రధాన కారణాలు – అజ్ఞానం మరియు దారిద్ర్యం. తన రెండవ కుమారుడైన సంగదాసు తన తండ్రి అభిప్రాయాలను సఫలం చేయడంలో కృతకృత్యుడై ఉంటాడు. హరిజనోద్ధరణలో భాగంగా చౌదరయ్య కొడుకు రామానాయుడుతో కలిసి ఊరూరా తిరుగుతూ ప్రసంగాలు ఇస్తుంటాడు. ఈ నేపథ్యంలో చౌదరయ్య తన కొడుకుని పాడు చేస్తున్నాడనే నెపంతో సంగదాసుని చంపించడం, రామదాసు ఓడిపోవడం జరుగుతుంది. రాందాసు కృంగిపోకుండా సంఘసంస్కరణలో భాగంగా విద్యాలయంని స్థాపించడం, ఇతర సంఘ సంస్కరణ కార్యక్రమాలు చేపట్టడం చౌదరయ్యకు కంటగింపై పాత దస్తావేజులు బయటకు తీసి రాందాసు పొలాన్ని అన్యాయంగా చేజిక్కించుకుంటాడు. రాందాసుపై జరుగుతున్న అన్యాయాలను పెద్దకొడుకైన వెంకటదాసు సహించలేక ఇల్లువిడిచి వెళ్ళిపోతాడు. 'తక్కెళ్ళ జగ్గడు' అనే పేరుతో 'ఉన్నవాళ్ళను' కొట్టి బాధలలో ఉన్న పేదవారికి సహాయం చేస్తుంటాడు. సమాజం దృష్టిలో దొంగగా చిత్రీకరించబడతాడు. ప్రభుత్వానికి తక్కెళ్ళ జగ్గడుకి మధ్య జరిగిన పోరాటాలలో జగ్గడు ఓడిపోయి జైలు పాలవుతాడు. ఎక్కడైతే తన తల్లిదండ్రులిద్దరూ అన్యాయంగా జైలు శిక్షననుభవిస్తున్నారో అక్కడికే అతను కూడా చేరతాడు. జైలులో దుర్భర జీవితం అనుభవించలేక కూతురు జ్యోతి మరియు మేనల్లుడు అప్పాదాసుల మరణవార్త విని రాందాసు భార్య మహాలక్ష్మమ్మ మరణిస్తుంది. వెంకటదాసు కూడా జైలులోనే మరణిస్తాడు. ఇన్ని జరిగినా ముందే చెప్పినట్లుగా రాందాసు స్థితప్రజ్ఞుడు, కర్మ సిద్ధాంతాన్ని నమ్మినవాడు. కాబట్టి కోర్టులకి అదీ వెళ్ళడు. జైలు నుండి విడుదల అయిన తర్వాత సంఘ సంస్కరణలకు పాటుబడతాడు.

## ప్రేమ్‌చంద్ 'రంగ్‌భూమి'

ప్రేమ్‌చంద్ 'రంగ్‌భూమి' నవలను 1924 సం॥లో ప్రచురించారు. ప్రథమంగా ఉర్దూ భాషలో 'చౌగానే హస్తీ'గా రాయబడినప్పటికీ 'హిందీ'లోనే ప్రచురించడమైనది. 'ప్రేమ్‌చంద్' నవలలు రంగ్‌భూమి, కర్మభూమి, ప్రధానంగా 'గోదాన్'. ఇవన్నీ కూడా భారత గ్రామీణ స్థితిగతులను చిత్రీకరించే గద్యకావ్యాలు. ప్రేమ్‌చంద్ నిజానికి గొప్ప జాతీయవాది, దేశభక్తుడు. కానీ వారి నవలలో 'జాతీయతాభావం' శక్తి మేరకు ప్రతిఫలించలేదని కొందరి సమీక్షకుల అభిప్రాయం.

'రంగ్‌భూమి' సంఘటనల ప్రధానమైన నవల 'సూర్‌దాస్' ఈ నవల నాయకుడు. అతనిలో సేవాభావము, మానవుని యెడల సానుభూతి, ఆత్మవిశ్వాసం మెండు. అతడు తన జీవితంలో కొన్ని సిద్ధాంతాలు కలిగినవాడు. ఎన్ని కష్టాలెదురైనా ఆత్మవిశ్వాసం మెండైన వాడు కాబట్టి తాను నమ్మిన సిద్ధాంతాలకు తిలోదకాల్విడు. ప్రజలు అతనిపై అసత్య ఆరోపణలు చేసినా, హేళన చేసినా, ఈర్ష్యపడినా, ఏం చేసినా దేనికీ భయపడడు సరికదా తన సిద్ధాంతాలపై అచంచలమైన విశ్వాసంతో స్థిరంగా నిలబడతాడు. అతను సాధువు కాదు, మహాత్ముడు కాదు, దేవుడు కాదు, దేవదూత కాదు కానీ జీవితాంతం ఆదర్శాలను పాటించినవాడు. ప్రేమ్‌చంద్ ఈ నవలలో 'సూర్‌దాస్' పాత్ర ద్వారా గాంధేయవాదాన్ని ప్రతిష్టించాడు. 'సూర్‌దాస్' స్వార్థం, అసత్యం మొదలైన కుసంస్కారాలను త్యజించిన యోగిలాంటివాడు. అతనికి ఈ ప్రపంచం ఒక 'రంగ్‌భూమి' (నాటకశాల) లాంటిది. ఎవరో అన్నట్లుగా - Life is a stage. ఈ జీవితమే ఒక నాటకం. ఈ నవలకి వేదిక 'బనారస్'కి సమీపాన ఉన్న 'పాండేపూర్ గ్రామం. ప్రధాన కథ 'సూర్‌దాస్'ది అయినప్పటికి వినయ్, సోఫియాల కథ కూడా ముఖ్యమైనదే. వీరితో బాటు ప్రేమ్‌చంద్ ఈ నవలలో పాండేపూర్ గ్రామ ప్రజల స్థితిగతులు, తాహిర్‌ఆలీ కుటుంబ కథ, జాన్‌సేవక్, రాణా మహేంద్రకుమార్ మరియు కున్వర్ భరత్‌సింగ్ లాంటి పాత్రలను కూడా సృష్టించాడు.

సూర్‌దాస్ గొప్ప మానవతావాది. ఒక్కొక్క పైసా కూడబెట్టి గ్రామంలో బావులు తవ్వించడం, మందిరాలను నిర్మించడం చేస్తాడు. ఆధునిక ఆర్థిక వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థకు జన్మనిచ్చిన తల్లి, ఆర్థికంగా చూస్తే ఈ వర్గం చాలా బలీయమైనది. 'రంగ్‌భూమి'లో 'జాన్‌సేవక్' పెట్టుబడిదారీ వర్గానికి ప్రతినిధి. 'సూర్‌దాస్'ని శ్రామిక వర్గానికి ప్రతినిధిగా పేర్కొనవచ్చు. వీరిరువురి మధ్య సంఘర్షణ, చివరికి పెట్టుబడిదారీ వ్యవస్థ విజయం, గాంధేయవాదం యొక్క ఓటమి, ఈ నవలలోని ముఖ్యాంశంగా పేర్కొనవచ్చు. అయితే ఒక్క విషయం ఇక్కడ ఆలోచించాలి! ఇక్కడ గాంధేయవాదం ఓడిపోలేదు నైతికంగా గెలిచింది. దీనితో ప్రేమ్‌చంద్, 'ఉన్నవ' సమాజానికి ఇచ్చిన సందేశమేమిటంటే

# మే నెల పురస్కారాలు





| | |
|---|---|
| **తెగించిన సాలమ్మ** | **ఇప్పుడు ప్రశ్నిస్తున్నాం** |
| కథకు........రూ.700/- | కవితకు.......రూ.500/- |
| రచయిత : తుమ్మా భాస్కర్ | రచయిత : డా॥ వి. గీతా నాగరాణి |

***సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.***

*మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.*

**- ఎడిటర్**

– "సామాజిక చైతన్యానికి లేదా మార్పునకు ప్రతిఘటిస్తే ఫలితమొస్తుంది కానీ దానికి అనంతమైన సహనం కావాలి."

ఇదేగాక, మాలపల్లి, రంగ్‌భూమి రెండింటిలోనూ వితంతు వివాహాలు, వేశ్యా సమస్య, స్త్రీ విద్య మొదలగునవి ఎన్నో విషయాలు చెప్పబడి వున్నవి. రంగ్‌భూమిలో అంతర్జాతీయ వివాహాలు, స్త్రీ స్వాతంత్ర్యం, మతపరమైన అంశాలు ఉంటే, మాలపల్లిలో అంటరానితనంపై పోరాటం, జమిందారీ వ్యవస్థ మరియు జాతీయ ఉద్యమంలాంటి అంశాలు ఉన్నాయి. ఈ సమస్యలన్నింటికి నవలలోనే అంతర్గతంగా సమాధానం కూడా చెప్పబడి ఉన్నది.

ప్రేమ, వివాహాల గురించి రంగ్‌భూమిలో వినయ్, సోఫియాల ప్రణయమే ఒక చక్కటి ఉదాహరణ. వినయ్ క్షత్రియుడు. సోఫియా స్వతంత్ర భావాలు గల నాయిక. అదేవిధంగా మాలపల్లిలో అప్పాదాసు మరియు జ్యోతిల అమలినమైన బాంధవ్యం.

రాందాసు మాలపల్లికి హృదయమైతే సూరదాసు రంగ్‌భూమికి ఆత్మగా పేర్కొనవచ్చు. రాందాసు సుఖదుఃఖాలను రెండింటిని సమానంగా ఒక కర్మయోగిలాగ స్వీకరిస్తే, సూరదాసు కూడా ప్రేమ్‌చంద్ మాటల్లోనే చెప్పాలంటే – "సూరదాసు తన నిష్కళంకమైన సాధనతో నవలలోని మొత్తం పాత్రల యొక్క మలినాన్ని కడిగిన ముత్యం."

రంగ్‌భూమి, మాలపల్లి రెండు నవలలను కూడా యధార్థమైన జీవితానికి సంబంధించిన సమస్యలను ఉదహరిస్తూ వాటికి సమాధానం వెతుక్కుంటూ సామాజిక మార్పునకు ప్రయత్నం చేసేవాటిగా పేర్కొనవచ్చు.

ఇక ఆఖరిగా ప్రేమ్‌చంద్ యొక్క 'రంగ్‌భూమి'లోని మౌలిక సమస్య ఏమిటి అని ప్రశ్నించుకుంటే సామంతవాదం మరియు జనవాదం పేరు మీద మహేంద్రకుమార్, రాజా కున్వర్ భరత్‌సింగ్, సూరదాసు పాత్రల సంఘర్షణగా చెప్పుకోవాలి! రంగ్‌భూమి నవలలో ప్రేమ్‌చంద్ దళిత పీడిత, దగాపడిన సమూహం తరపున సంఘమనే కోర్టులో దావా వేసినపుడు ఓడిపోతాడని తెలిసీ, సవివరంగా చర్చించడమే ప్రేమ్‌చంద్ విజయంగా పేర్కొనాలి.

అలాగే మాలపల్లిలో వర్ణించబడిన సంఘసంస్కరణ కేంద్రాలు, జైలు, కోర్టు, పాఠశాల, ఖాదీ, సహాయ నిరాకరణ, స్వరాజ్య సంగ్రామం, అహింస మొదలైన విషయాల చర్చ వల్ల సమకాలీన పరిస్థితులు అవగాహనకొస్తాయి. ఆంధ్రదేశపు గ్రామీణ జీవనానికి ప్రతీకగా ఈ నవలను పేర్కొనవచ్చు.

నిర్వివాదంగా రంగ్‌భూమి, మాలపల్లి రెండు నవలలు నవజాగరణ మరియు సామాజిక చైతన్యానికి ప్రతీకలు. ఈ సత్యాన్ని ఇరువురు మహానుభావులు తమ రచనా కౌశల్యంతో భారతగ్రామీణ జీవితాన్ని కళ్ళకు కట్టినట్లుగా చిత్రీకరించారనడంలో అతిశయోక్తి లేదు. ఇరుభాషల మేధావులు, సాహితీప్రియుల మధ్య పరస్పరం ఒక చర్చ జరుగుతుండేది. అదేమిటంటే 'మాలపల్లి', రంగ్‌భూమి' నవలలు గాంధేయవాదంతో ప్రభావితమైనవా లేక మార్క్సువాదంతోనా? భిన్న భిన్న అభిప్రాయాలు వెలువడ్డాయి. కానీ ఒక్క విషయంలో సమానత్వాన్ని మాత్రం ఖచ్చితంగా ఈ రెండు నవలలోను దర్శించవచ్చు. అది – సామాజిక చైతన్యం మరియు మానవ శ్రేయస్సుని కాంక్షించే దృష్టితో నవలా రచన జరిగింది. కనుకనే నేటి ప్రపంచీకరణ నేపథ్యంలో కూడా ప్రపంచమే పల్లెగా మారిపోతున్న వేళ "స్థానికత" అనే సంస్కారభావం వల్లనే 'రంగ్‌భూమి', 'మాలపల్లి' నవలలు, ప్రేమ్‌చంద్, ఉన్నవ లక్ష్మీనారాయణలు నిత్యప్రాత్ఃస్మరణీయులే!

**(కేంద్ర సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ వారి బెంగుళూరు ప్రాంతీయ కార్యాలయం ద్వారా మార్చి 15వ తేదీన గుంటూరు నందు జరిగిన ఉన్నవ వారి 'మాలపల్లి' జాతీయ సదస్సులో ఆచార్య ఎన్. గంగప్ప అధ్యక్షతన 'మాలపల్లి – ఇతర అంశాలు' అను సమావేశము నందు సమర్పించిన పత్రం)**

**సెల్ : 9989242343**

కథ

# సాక్ష్యం బతికింది



**- తరిమెల అమరనాథరెడ్డి**

**"అన్నా! యింతకు ముందే ఎవరో మీ ఫ్రెండ్ బండమీదపల్లె కొండారెడ్డి రక్తం కోసం ఫోన్ చేసిండె. మొన్న ఎలక్షన్లలో వాళ్ల ఊర్లో కొట్లాడుకున్నారంట. వాళ్నాయప్పకు బలంగా దెబ్బలు తగిలినాయంట. రక్తం ఎక్కిల్లంట" ని చెప్పినాడు మా ప్రెస్ వర్కర్ నారాయణ అప్పుడే ప్రెస్‌లోకి అడుగుపెడుతున్న నాతో.**

సరేలే వాళ్ల వాళ్లు దండిగా వుంటారులే. వాళ్లే ఎవరో ఒకరు ఇచ్చుకొంటారులే. మల్లా ఫోన్ చేస్తే చూద్దాంలే అనుకొని ప్రెస్‌లోనే ప్రూఫ్ చూస్తూ కూచున్నా.

ఇంతలోనే ఫోన్ మోగింది. బహుశా వాళ్లదేనేమోనని ఎత్తి 'హలో' అన్నా.

'అయ్యా! నేను వేములపాడు రామున్ని. మీ మామా వాళ్ల జీతగాన్నయ్యా. యీడ గవనమెంట్ ఆస్పత్రిలో చేరినా. నాకు బెడ్డు కావలయ్యా. బిరీన రాయ్యా' అంటూ ఎంతో ఆత్రంగా ఫోన్ చేసినాడు.

సీరియస్‌గా వుందేమో అని వెంటనే ఆస్పత్రికి పోతే అక్కడే నాకోసం ఎదురు చూస్తున్న రాముడు 'అయ్యా! నేనే ఫోన్ చేసింది బెడ్డుకోసరం' అంటూ తను వున్న మెడికల్ వార్డ్‌లోకి పిల్చుకొని పొయ్యినాడు నన్ను.

'ఏమి బ్లెడ్ కావల్లంట' అంటే బ్లెడ్ కాదయ్యా బెడ్డు' అన్నాడు.

'అరె! నీక్కావల్సింది బెడ్డా. మామూలుగా చాలా మంది బ్లడ్‌ను బెడ్డు అంటుంటారు. నువ్వు అట్లనే బెడ్డు అన్నావేమో అనుకున్నా. చూడు రాముడూ నేను బ్లెడ్ అయితే యిప్పిస్తా కానీ బెడ్ యిప్పీలేను. ఈ వార్డ్‌లో బెడ్డుకు యిద్దరు పేషంట్లు వుంటారు. మంచాలు తక్కువ మనుషులు ఎక్కువ. అంతే సర్దుకోల్సిందే.' అని నచ్చచెప్పి, ఎట్లా వచ్చినాం కదా బండమీదపల్లెతన్ని చూసొస్తాం అని సర్జికల్ వార్డ్‌లోకి పొయ్యినాను.

ఆ వార్డ్‌లో ఒక బెడ్ దగ్గర పల్లెజనం ఈగల్లా ముసురుకొన్నారు. వాళ్లతోపాటు ఇద్దరు పోలీసులు కూడా వున్నారు. బహుశా ఇతనే అయింటాడని దగ్గరకు పోయి అడిగితే 'ఔనయ్యా బండమీద పల్లె సుంకన్నయ్యా' అంటూ నేనెవరో అన్నట్లు ఎగాదిగా చూసినారు వాళ్లు.

సుంకన్న తలకు బలమైన గాయాలయ్యాయి. గుడ్డలు రక్తంతో తడిసి ముద్దయినాయి. మనిషి చూస్తే బలిష్టంగానే వున్నాడు కష్టజీవే. ఒకవైపు సుంకన్నకు రక్తం ఎక్కిస్తాండారు. మరోవైపు పక్కనే స్టూలు మీద కూచున్న కానిస్టేబుల్ సుంకన్నతో స్టేట్‌మెంట్ తీసుకుంటున్నాడు.

సుంకన్న తనపై ఎవరు దాడి చేసిందీ నెమ్మదిగా చెప్తున్నాడు. పక్కనే వున్న వాళ్ళ గ్రూపు మనుషులు అతను తమ ప్రత్యర్థుల పేర్లన్నీ సరిగా చెప్తాడో, లేదో అన్నట్లు గుడ్లప్పగించి చూస్తూ చెవులు నిక్కబొడుచుకొని వింటున్నారు.

'లే కిట్టన్నా! సుంకన్న గాడు సాయంత్రం వరకు బతికేది నమ్మకం లేదులే. చూత్తాంటే తెల్లమొగం పడింది. కండ్లు మూసుక పోతాండాయ్' అని గొణుగుతున్నాడు ఒకతను తన పక్కనే వున్నతనితో

'లే! (స్టే) టేట్‌మెంట్ యిచ్చేదంక బతికే చాల్లేలే. మల్లా సచ్చినంతా కేసు బలమైతుంది లేలే. బతికితే వీనికి ఎదురు పార్టీ వాళ్ళు దుడ్లు పారేస్తే దెబ్బలు తగిలిన కంపంలో ఏమి చెప్పినానో నాకు గొత్తుకు లేదని అడ్డం తిరుక్కుంటే కేసు ఎత్తిపోతుందిలే. యవారం కథ నీకేం తెల్సు యెర్రి నాకొడుక్కు!' అంటూ గుసగుసలాడాడు వానితో కిట్టప్ప.



వీళ్ళిద్దరూ సుంకన్న గ్రూపు మనుషులే అని అర్థమైంది. వాళ్ల మాటలు వింటే బండమీద పల్లెవాల్లవి రాతి గుండెలేమో అనిపించింది నాకు. వారిమీద కోపం, ఏహ్యాభావం, సానుభూతి ఏర్పడ్డాయి నాలో. నాయకుల స్వార్థానికి బలిఅయ్యే కూలి బతుకులు వీరివి. మడికోసినా, మెడకోసినా, నాటువేసినా, చివరకు ఓటు వేసినా వీరికి దక్కేది ఆపూట కూలి మాత్రమే కదా. పదో, పరకో సాయం చేస్తారనే ఆశతో నాయకుల పంచన చేరింటారు వీళ్ళు. ఇట్లా వాళ్లను పనిముట్లుగా, మెట్లుగా వాడుకుంటారు పదవులు, ఆస్తులు సంపాదిస్తారు నాయకులు.

ఎవరైన కొట్లాటలు మన కెందుకులే, మన బతుకు మనం బతుకుదామని అనుకున్నా బతకనీరు. ఏదో ఇబ్బందులు పెట్టి ఇరికించుకుంటారు. తమ చేతుల్లో కీలు బొమ్మలను చేసి ఆడిస్తారు. ఒకప్పుడు ఊరికి ఉడ్డా ముగ్గురు నాయకులుండేవాళ్లు, యిప్పుడు ఇంటికి ఐదుమంది అయినారు. ఇట్లా పెద్దమనుషులు ఎక్కువయ్యే పల్లెలు పాడైపోతున్నాయి. ఏ పల్లెలోనైనా యిదే పరిస్థితి అనేది నేనూ పల్లెటూరోన్ని కాబట్టే బాగా తెలుసు. ప్రజల్లో సరైన రాజకీయ చైతన్యం, ఆర్థిక స్వాతంత్ర్యం రానంత వరకు వీరి బతుకులు యింతే కదా అనుకుంటూ ప్రెస్‌కు వచ్చినా.

తర్వాత పది రోజులకు ఎవరో పల్లెటూరి ముసలాయన ప్రెస్ దగ్గరికి వచ్చి 'అయ్యా! నా కొడుక్కి రగతం సాయం చేయయ్యా. యిప్పుడు యెంటనే యెక్కిల్లంటయ్యా. లేకపోతే బతకడంటయ్యా. ఎట్లన్న గానీ సాయం చేసి నా కొడుకును బతికిచ్చి పున్నెం కట్టుకోయ్యా' అంటూ నా కాళ్ళ మీద పడి ఏడుస్తున్నాడు.

'అరె! అట్లా చెయ్యొద్దప్పా. లెయ్యి. నువ్వేమి భయపడొద్దు. నీ కొడుక్కు ఎన్ని బాటిల్లు రక్తం అయిన నేను యిప్పిస్తాను. నువ్వేడ్చొద్దు' అని ఓదారుస్తూ 'ఏం పేరు నీ కొడుకు పేరు?' ఏం రక్తం కావల్లంట? అని అడిగినా.

'అయ్యా! మాది బండమీద పల్లెయ్యా. నా కొడుకు సుంకన్నయ్యా' అంటానే 'ఓహో సుంకన్న నీ కొడుకేనా. ఇంతకు ముందు మీ నాయకుడు కొండారెడ్డి కూడా ఫోన్ చేసింది నీ కొడుక్కోసమేనా. ఆయన రాలేదా? నువ్వే వచ్చినావు'.

'ఏమిటి కొత్తాదయ్యి. మా తిప్పలు మేం పడాల్సిందే. పని అయిపోయినంక మమ్మల్ని మాట్లాడిచ్చే వాళ్ళే వుందరయ్యా. మా సావు మేం సావాల్సిందే. కూలి చేసుకొని బతికే వాళ్లం మనకెందుకురా ఈ ఎలెచ్చన్లు, కొట్లాటలు అంటే ఇనకుండా వాళ్ళిచ్చే సారాయి దుడ్లకు ఆశపడి పొయ్యినాడు. పాణం మిందకు తెచ్చుకుండాడయ్యా. యిప్పుడేమన్నయితే మాకు దిక్కెవరయ్యా. వాడు కట్టం చెయ్యల్ల, మేం తినల్ల' అంటూ కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు. 'నువ్వేడ్చొద్దప్పా మేం రక్తం యిప్పిస్తాంలే. బాగైతుంది' అని ఓదారుస్తూ 'ఏమి గ్రూపు కావల్లంట'? అంటే 'అందేందో దీంట్లో రాసినారయ్యా' అంటూ తన చేతిలో కాగితం నా చేతికిచ్చినాడు. అందులో ఏ నెగిటివ్ అని వుంది. అబ్బా ఇది రేర్ గ్రూపు. దొరికేది కష్టం. అయినా వెంటనే మా ఎమర్జెన్సీ డోనర్ హరి గుర్తొచ్చి హరీ! ఎమర్జెన్సీ వెంటనే వస్తావా రక్తం ఇచ్చేకి' అని ఫోన్ చేసినా.

'ఏమన్నా గర్భిణీకా?' అని పేషెంటు పరిస్థితి కనుక్కుందామనే తాపత్రయంతో అడిగినాడు హరి.

'కాదు హరీ, ఎవరో పల్లెటూరతనికి. ఎన్నికల్లో కొట్లాడుకున్నారు. రక్తం చాలా పోయింది. ఎమర్జెన్సీగా ఇవ్వాలంట. లేకపోతే బతకడంట.'

'అన్నా! సారీన్నా. ఎవరన్న గర్భిణీకైతే చెప్పు అర్థరాత్రి పిడుగులుపడే వానలో అయినా వస్తా. కానీ యిట్లా కొవ్వుపట్టి కొట్లాడుకునే నాయల్లకు ఏందన్నా మనం రక్తయిచ్చేది. ప్లీజ్ నన్ను ఏమీ అనుకోవద్దన్నా' అన్నాడు హరి.

'అరె! ఎప్పుడు పిల్చినా వెంటనే రక్తం యిచ్చేవాడు, వారం కిందటే కనపడి "ఏమన్నా నాకు మల్లా ఛాన్స్ యీలేదే" అన్న హరి యిప్పుడు యిట్లా అంటాంటే నాకు ఏమి చెయ్యాల్లో దిక్కుతోచక 'హరీ! సమయానికి వేరే డోనర్లు ఎవ్వరూ చిక్కలేదు. నువ్వే దిక్కు. నీ కాళ్లు మొక్తాను రా' అన్నా దీనంగా.

'అన్నా! ఏందన్నా నాకన్న పెద్దోనివి. నువ్వేందన్నా నా కాళ్ళు మొక్కుతాననేది.' అన్నాడు హరి యిబ్బంది పడుతూ.

'యింకేమి చెయ్యల్లో నాకు తోచలేదు హరీ. యిక్కడేమో పేషంటు వాళ్ల నాన్న పెద్దోడు నా కాళ్లు మొక్కుతాండాడు. నువ్వు ఎందురుగా వుంటే నీకాళ్లు మొక్కేవాడు కదా. అందుకే ఆయప్ప తరుపున నేను నీ కాళ్ళు మొక్తాండా రా ప్లీజ్' అన్నాను.

'అన్నా! నువ్వు అంతగా పిలుస్తాండావు కాబట్టి వస్తా ఐదు నిమిషాల్లో' అని ఫోన్ పెట్టేసినాడు హరి.

'సరే పెద్దాయప్పా నువ్వు ఆస్పత్రి దగ్గరికి పో. మా సార్ వస్తానే మేం యిద్దరం కలిసి వస్తాం పో, అని చెప్పి పంపినా సుంకన్న నాయన్ను.

చెప్పినట్లే హరి వచ్చినాడు. యిద్దరం కలసి ఆస్పత్రిలో సుంకన్న వున్న వార్డ్‌లోకి అడుగు పెడుతూనే అతని బెడ్ దగ్గర పెండ్లాం, పిల్లలు ఒకరినొకరు గట్టిగా కరుచుకొని ఏడుస్తుండడం చూస్తానే అర్థమైంది సుంకన్న చనిపోయినాడని. పక్కనే వున్న అందగూ సానుభూతిగా చూస్తున్నారు వాళ్ల వైపు.

దగ్గరకు వెళ్లి చూస్తే చేరిన రోజు దుబ్బగా వున్న సుంకన్న యిప్పుడు చిక్కిపోయి దబ్బలా వున్నాడు. ఎన్నోఏండ్లు తన పెళ్ళాం, పిల్లలకు, ముసలి తల్లిదండ్రులకు అండగా వుండాల్సిన సుంకన్నను పల్లె రాజకీయం కాటేసింది. సుంకన్న కూలి బతుకు కూలిపోయింది. వారిని ఓదార్చడానికి మాకు మాటలు రాక.... మాటలు లేక..... ఎందరో అమాయకులు యిలా రాజకీయ నాయకులు స్వార్థానికి బలిపశువులు అనుకుంటూ వచ్చేశాం.

అనుకోకుండా అదే రోజు సాయంత్రం బజారులో బండమీద పల్లె కొండారెడ్డి కనపడినాడు. 'ఏం బ్రదర్ బాగున్నావా? ఎక్కడికో పోతాండావ్? ఆస్పత్రికాడికేనా?" అని అడిగినా.

'ఊహూ వకీలు దగ్గరకు పోతాండా అమరా. పది దినాల కిందట మా ఊర్లో ఎలెక్షన్లలో గలాటా అయిందికదా, అప్పుడు నీకు ఫోన్ చేసింటి మా వానికే రక్తం కావల్లని. నువ్వు లేకపోతివి. అంతలేకే మా వాళ్లే యిచ్చిరి. ఆ కేసు విషయమే మాట్లాడేకే వకీలు దగ్గరకు పోతాండా'. అన్నాడు తాపీగా.

'ఔనులే మీ వాడు సుంకన్నే కదా. మధ్యాహ్నమే అతనికి రక్తం యిప్పిచ్చేకి పోయింటిమి. కానీ అప్పుడే చనిపోయినాడు', అన్నా.

నా మాట వింటానే సంతోషంగా, ఆశ్చర్యంగా 'అబ్బా! చచ్చిపొయ్యినాడా' అంటూ వెళ్ళిపోయినాడు. తన అనుచరుడు చస్తే బాధపడుతాడేమో అనుకొన్న నాకు అందుకు భిన్నంగా సంతోషపడుతున్న అతని ప్రవర్తన చూస్తే వొళ్ళు గగుర్పొడిచింది.... కాదు.... కాదు...... వొళ్ళు మండింది. అరె ఒకప్పుడు బతికిచ్చుకోవల్లని తాపత్రయపడిన ఇతనే ఇప్పుడు సుంకన్న చనిపోతే ఎందుకు యింత సంతోషపడుతున్నాడో. ఎంత దుర్మార్గుడో అనుకున్నా. నాయకులు తమస్వార్థం కోసం తమ శత్రువులనే కాదు, అవసరమైతే తమ వాళ్లనే చంపుకుంటారనేది గుర్తొచ్చింది. కాస్సేపు ఏమీ తోచకున్న నాకు '(స్టే)టేట్‌మెంటు యిచ్చేదంకా బతికితే చాల్లేలే. మల్లా సచ్చినంతా కేసు బలమైతుంది లేలే. యవ్వారం కత నీకేం తెల్సు యెర్రినాకొడుక్కు' అనే కొండారెడ్డి గ్రూపు కిట్టప్ప ఆస్పత్రిలో అన్నమాటలు గుర్తొచ్చినాయి 'గీతోపదేశంలా'.

అప్పుడు కానీ అర్థం కాలేదు. "సాక్షి సచ్చినా సాక్ష్యం బతికిందనే" స్వార్థ దురాలోచనే ఆ నాయకుని సంతోషానికి కారణమని.

**(రక్తదాన కార్యక్రమంలో ఎదురైన అనుభవం)**

**సెల్ : 9346735480**

## పోరుపిట్ట

- మొయిద శ్రీనివాసరావు
సెల్ : 9908256267



బాల్యాన్ని తనతోనే ఎంగిలి చేసుకున్నాను
కావాల్సిన వారికోసం కబురు పెట్టుకున్నాను
మా ఇంటిపై నిత్యచుట్టమై వాలితే
ఎంగిలి చేతినైనా కనీసం విదిలించలేకపోతున్నాను
తను మాత్రం రాత్రిని ఒంటికి పూసుకుని
వేకువ కేకలేస్తూ... తూర్పును
ఎర్ర పుండుగా మార్చే వేకువ పిట్ట.
పుల్లనో, ముల్లునో నోటకరిచి తెచ్చి
కష్టపడి కట్టుకున్న గూటిలో
కులాసా పిట్ట గుడ్లును సైతం
ప్రేమగా పొదిగే అమాయకపు పక్షి
ఎర్రని ఎండలో
పురుగో, పుట్రో ఏరి తెచ్చి
కళ్ళు తెరవని పిల్లల నోటిలో
ఉషోదయానికి ఊపిరిలూదిన మాతృమూర్తి.
పచ్చని బతుకు చెట్టుపై కన్నేసి వాలిన
డేగ తలపై ఎగిరెగిరి తంతూ
తిరుగుబాటు బావుటా ఎగరేసిన పోరుపిట్ట.
కాకరాపల్లిలో కరెంటు దెబ్బకు
రెండు పేద పిట్టలు నేలరాలితే
గుంపు మొత్తంతో కలిసి గాలిలో గింగర్లు కొడుతూ
సమర సన్నాయిని ఊదిన చైతన్యదీప్తి.
అందుకనేనేమో...
చైత్రంలో పచ్చని మావి గుబుర్లులోంచి పైకి వచ్చే
'కుహు, కుహు'ల కూనలమ్మ కూనిరాగం కంటే
'కావు, కావు'లో ధ్వనించే
శ్రమైక జీవన నాదమే జనపదమై
నిత్యం నాలో జవసత్వాలు నింపుతుంది

---

## భూమిపుత్రుడు

- భూషి కృష్ణదాసు



ప్రొద్దున్నలేవటంతోనే
వాడు కుమ్మరిపురుగులా
మట్టిలో దూరిపోతాడు
మట్టిపిసుకుతాడు
మట్టిలో దేవుళ్ళాడతాడు
దరిద్రాన్ని మొలకు కండువాలా
చుట్టుకొని పనిలో
తలమునకలౌతాడు
మధ్యాహ్నం
కడుపు కొలిమి భగభగమన్నపుడు
తన ఆకలి సంగతి తెలుస్తుంది
గుర్తొస్తారు పెళ్ళాం బిడ్డలు
ఆవురావురంటూ ఇంటి కొస్తాడు
ఏముందక్కడ-
పుట్టెడు దారిద్ర్యం ఎదురౌతుంది
బోర్లించిన ఖాళీ సత్తుగిన్నెల్లా
పెళ్ళాం బిడ్డలు కనబడతారు
అధ్వాన్నపు ఆకలి అడవిలో పనిచేసి
నేల తల్లి వొంటి మంటిని కంట్లో పెట్టుకొని
ఆకలితో ఇంటికొచ్చిన అతనికి
ఏ ముందక్కడ -
బ్రతుక్కోసం వెతుకులాట వెతలు
కాకుంటే చెదలు తింటోన్న జీవితం
రోజు రోజూ దశల వారీగ
చస్తున్నాడు మాన్యుడు సామాన్యుడు.

---

## నాలుగో కాలు

- పిట్ట సాంబయ్య
సెల్ : 9849674768



వృద్ధాప్యం భారమై
శైశవంగా మారిన శరీరానికి
చేయిపట్టి చేరదీసి
కమ్మని స్థన్యధారతో చేవనిచ్చి
అక్కున చేర్చుకునే
అమ్మతనం కావాలి
ఇళ్ళంతా
ఛల్ ఛల్ గుర్రమంటు
మనిషే నాలుగు చక్రాల బండిగా మారి
మమతానురాగాలు నింపే
ఎనలేని నాన్నతనం కావాలి
శిశిరమవుతున్న మహావృక్షానికి
రాగసుధలతో
పత్రహరితం నింపి
బాల్య స్రవంతికి మళ్ళించే
పంట కాలువ కావాలి
తోబుట్టువులతో
ఒంటి గిన్నెలో ఎంగిలి పంచుకు తిన్న
అమ్మ గోరుముద్దల
కమ్మతనం కావాలి
అనుభవాన్నంతా రంగరించి
జీవితపు రంగు రుచులు
లోకానికి తెలిపి
అలసిపోయిన బాటసారికి
సేదదీర్చే చల్లని నీడై
విస్మృతికి గురైన స్మృతులను
మధురంగా చూపే
భూతకాల యంత్రం కావాలి
మూడు కాళ్ళపై కూడ
నిలువలేని తాత తనానికిపుడు
కొండంత మానవత్వంతో
మొత్తంగా
మనిషితనం నింపుకుని
ఆలనతో
ఊతమిచ్చి నిలబెట్టే
"నాలుగో కాలు" కావాలి ఇపుడు

# తెలంగాణా జన జీవితం "కొలిమంటుకున్నది" నవల




- మర్రి పవన్

నిశితమైన సామాజిక పరిశీలనతో, శాస్త్రీయమైన అవగాహనతో, ప్రజల హితాన్ని అభిమానిస్తూ ప్రజల కొరకు రచనలు చేస్తున్నారు రచయితలు. ఆ క్రమంలో వచ్చినటువంటి నవల "కొలిమంటుకున్నది". ఇది నవల కాదు. తెలంగాణాప్రజల జీవితం. ఎన్నో ఏళ్ళుగా భూస్వామ్య దోపిడీ కింద తమ జీవితాలను బలిదానం చేసుకుంటున్న తెలంగాణా పల్లె ప్రజలు ఏ విధంగా చైతన్యాన్ని పొంది, దోపిడీకి వ్యతిరేకంగా పోరాటాన్ని చేసినారో సజీవంగా చిత్రించిన నవల ఇది. ఈ నవల రచయిత అల్లం రాజయ్య.

తెలంగాణాలోని వ్యవసాయదారుని తిరుగుబాటు ప్రారంభ దశను, పీడిత, తాడిత పల్లె ప్రజల తిరుగుబాటు చైతన్యాన్ని చిత్రించిన నవల "కొలిమంటుకున్నది".

రెండున్నర ఎకరాల భూమి కలిగిన నర్సింహానికి భార్య మల్లికాంబ, కూతురు సత్తెవ్వ ఉంటారు. ఆశలన్నీ భూమి మీదనే నిలుపుకొని మోటబావికి కరెంట్ మోటార్ పెట్టించుకోవడానికి తన భూమిని ఊరి షావుకారి రామలింగం దగ్గర తాకట్టు పెట్టి కరెంట్ ఆఫీసు చుట్టూ తిరిగి లంచాలు ఇచ్చి ఎదురు చూస్తున్న క్రమంలో ఆ ఊరి భూస్వామి ప్రతాపరెడ్డి, నర్సింహం భూమిలోని పెరడులోని కరెంట్ స్తంభాలను తన మనుషులతో పీకించి, తన తోటలో పాతించుకోవడంతో "కొలిమంటుకున్నది" నవల ప్రారంభమవుతుంది.

ఆ అన్యాయాన్ని ప్రశ్నించి నందుకు ప్రతాపరెడ్డి దొర మనుషులు చావుదెబ్బలు కొడతారు. తనకు జరిగిన అన్యాయాన్ని ఆ ఊరి ఒక మోతుబారి రైతు ముకుందరెడ్డికి విషయం చెబితే ప్రతాపరెడ్డిని మనం ఏమి చేయలేమని, కావాలంటే కరెంటు ఆఫీసు ద్వారా మరల స్తంభాలు, తీగలు మంజూరు చేయించుకునే ప్రయత్నం చేయమని చెప్తాడు. పట్వారి గౌరయ్య కూడా అలాగే మాట్లాడి దొరను క్షమాపణ అడగమంటాడు. దొరలు దొరలు ఒక్కటైనారని అర్థం చేసుకున్న నర్సింహం "ఏదైతే అదయింది? నిండనైతే మునిగిన నిండ మునిగినంక సలెక్కడిది?" అని అనుకొని నేరుగా ప్రతాపరెడ్డి దొర గడిలోకి వెళ్ళి అతడినే ప్రశ్నిస్తాడు. తన వంద ఎకరాల మిరపతోటకే కరెంట్ మోటార్ అవసరం నీ రెండున్నర ఎకరాలకు ఎందుకంటు దొర అవహేళన చేస్తూ మాట్లాడతాడు. అంతేకాక సుంకర్లచే కొట్టించడం, నర్సింహంను ఆర్థికంగా దెబ్బతీసిన దొర అతని మీద పరాయిస్త్రీతో లేని అక్రమ సంబంధాన్ని అంటగట్టి సాంఘికంగా, ఆర్థికంగా దెబ్బతీయడమే కాకుండా ఊరందరి ముందు ఎంకమ్మతో ఫిర్యాదు చేయించి చెప్పుతో కొట్టి తన కోపాన్నంతా ఈ విధంగా తీర్చుకుంటాడు.

కొన్ని రోజులకు నర్సింహం తనకు సహాయం చేస్తారేమోనని పోలీస్ స్టేషన్‌కు, కరెంట్ ఆఫీస్‌కు వెళ్ళి ఫిర్యాదు చేసినా అక్కడా చుక్కెదురవుతుంది. అది చూసి "ఎన్నటికైనా ఉన్నోడు ఉన్నోడు ఒకటి... కులం కులం ఒక్కటట. ఆళ్ళాల్లు ఒక్కటిగాకుంటే ఏమి లేనోన్ని భుజాల మీదెక్కించుకుంటారా?" అనుకుంటాడు. తోడల్లుడు అయిలయ్య చిన్నకొడుకు చంద్రయ్య చెప్పిన మాటలను బట్టి సన్నకారు రైతులు క్రమ క్రమంగా భూమికి దూరమవుతూ వేతన కూలీలుగా మారుతున్న దుస్థితిని నర్సింహం అవగాహన చేసుకుంటాడు.

తరువాత ప్రతాపరెడ్డి దొర, నర్సింహం పండించిన మొక్కజొన్నను కాలబెట్టడం, ఇంజన్‌ను దొంగిలింపజేయడం, షావుకారు తను ఇచ్చిన బాకీ కింద భూమిని తీసుకోవడం, భూమిలేని నిరుపేదగా నర్సింహం మిగిలిపోవడం ఈ నవలలో భాగాలుగా వుంటాయి. చంద్రయ్య, ఆనందంలు కూలిరేట్లు పెంపుదల కోసం ఏర్పాటు చేసిన సంఘంలో నర్సింహం చేరతాడు. నాలుగు మొక్కజొన్న కంకులు తిన్నందుకు ప్రతాపరెడ్డి కొట్టిన దెబ్బలకు రాయపోశాలు చనిపోగా జనమంతా దొర మొక్కజొన్న పెరడును విరుచుకుతిని, తమ వెంట తీసుకువెళతారు. ఆ సంఘటనతో దొర అన్యాయాలను ఎదిరించి పోరాడాలన్న తిరుగుబాటు చైతన్యం ఊరి ప్రజలలో కలుగుతుంది. విషయం తెలుసుకొని ప్రతాపరెడ్డి దొర గూండాలను పంపగా వారు జనం మీద పడి కొట్టి నర్సింహం, చిన్న వెంకటి లాంటి కొందరు ముఖ్యమైన వారిని గడికీ ఎత్తుకొని పోతారు. దానికి ప్రతీకగా ఊరి జనం గడీ మీద దండెత్తుతారు. బంధించిన మనుషులను విడిచిపెట్టాలని, వెట్టి పనులు రద్దు చేయాలని, దున్నేవానికి భూమి దక్కాలని నినాదాలు చేస్తూ గడి తలుపులు బద్దలు కొడుతుండగా ప్రతాపరెడ్డి తుపాకీతో జరిపిన కాల్పుల్లో సాంబయ్య అనే కూలీ

# ఒక్కమాట



హిందీ మూలం : రమేశ్ గోస్వామి

తెలుగు : ఆర్. శాంతసుందరి

అతనికోమాట చెప్పాలనుకుంటున్నాను

చెప్పేశాను
సముద్రంలో కాగితప్పడవని వదిలేశాను
ప్రతి కోరికనీ తప్పించుకుంటూ
ఒడ్డు మీద కలల చలిమంట వేసుకున్నాను

ప్రేమకి సిఫార్సు కాయితమ్ముక్క తగిలించలేదు
సంతోషాన్ని రమ్మని పిలవలేదు
గతాన్ని తూచలేదు
రేపటిని తడిమి చూడలేదు
శూన్యంలో ఎక్కడో తప్పిపోయానని ప్రకటన వేయించాను
నా చేతిరాతే నాకు అపరిచితమైపోయింది
కొత్త ఆలోచనలతో సిరా ఇగిరిపోయింది
ఒక మసీదు కూలిపోయింది
ఒక చర్చి కాలిపోయింది
దేవుడికి భక్తులే అటువంటి శిక్ష వేశారు

---

చనిపోతాడు. చాలామంది గాయపడతారు. అయినా వెనక్కి తగ్గక జనం గడీలోకి చొచ్చుకుపోతారు. దొర కాల్పులు ఎక్కువ చేస్తాడు. పోలీసులు వచ్చి జనాన్ని వ్యానులో తీసుకువెళ్ళడం, ప్రతాపరెడ్డి పెళ్ళాం పిల్లలతో ఊరు విడిచి వెళ్ళడానికి సామాన్లు సర్దుకోవడంతో ఈ నవల ముగుస్తుంది.

ఉత్తర తెలంగాణలో భూస్వామ్య పీడన దౌర్జన్యాలు బాగా అమలయ్యే ఓ పల్లెలో ఈ నవలలోని కథ అంతా జరుగుతుంది. రోడ్లు వేయడం అనేది గ్రామాభివృద్ధిలో భాగమే అయినా అంతిమంగా ఆ అభివృద్ధి ఫలాలు ఎవరు పొందారన్నది ప్రశ్న.

వంద ఎకరాల భూమిలో వ్యాపారపు పంట పండించే ప్రతాపరెడ్డి మిరపపంటను మార్కెట్‌కు తరలించడానికి గాను ఊరికి రోడ్డు కావాలంటూ ముందుండి వ్యవహారం నడిపిస్తాడు. ఇంజనీర్, కాంట్రాక్టర్ అంతా తన వాళ్ళే గనుక తన పొలంలోంచి పోవలసిన రోడ్డును నర్సింహం పెరట్లో నుండి వెళ్ళేలా చేసి తన భూస్వామ్య నైజాన్ని ప్రదర్శించాడు. అభివృద్ధి ఫలాలను గ్రామాలలో ప్రతాపరెడ్డి లాంటి దొరలు పొందుతుంటే, నర్సింహం లాంటి సన్నకారు, బక్క రైతులు అడుగడుగునా మోసగించబడుతూనే వుంటారనీ, జీవితాలు ధ్వంసం అవుతూనే వుంటాయని కరెంట్ స్తంభాల సంఘటన కూడా "కొలిమంటుకున్నది" నవలలో రుజువు పరిచింది.

ఉత్తర తెలంగాణాలో గ్రామాలలో దొరల పెత్తందారీతనాన్ని "కొలిమంటుకున్నది" నవల అడుగడుగునా ఆవిష్కరించింది. ప్రతాపరెడ్డి తన దగ్గర పనిచేసే వాళ్ళందరినీ బానిసలుగానే చూశాడు. వాళ్ళకూ జీవితాలుంటాయని, భార్య పిల్లలుంటారని, ఆకలిదప్పులుంటాయనే విషయాలను అతడు పరిగణనలోకి తీసుకోడు. వెంకమ్మ తండ్రి ప్రతాపరెడ్డి దగ్గర జీతగాడు. అతడి చేత వెట్టి చాకిరి చేయించుకోవడమే కాక వెంకమ్మ జీవితాన్ని కబళించాడు. వెంకమ్మను తన శారీరక సుఖాల కోసం వాడుకున్నాడు. పెళ్ళయినా వెంకమ్మను వదిలిపెట్టలేదు. దొర దురాగతాలకు భర్త బలైపోతే మళ్ళీ పుట్టింటికి చేరుకున్న వెంకమ్మ అతడి చేతిలో పావుగా మారింది. నర్సింహ తనను బలాత్కరించాడని పంచాయతీలో చెప్పడం ఆ విషయాన్ని తెలియజేస్తోంది.

ఉత్పత్తి సాధనాలను, వనరులను తమ అధీనంలో వుంచుకొని దోపిడీ, దౌర్జన్యాలు సాగించే భూస్వామ్య, పెత్తందారీ వర్గం, దోపిడీకి, దుర్భరమైన బతుకు పీడనకు గురవుతున్న ప్రజానీకంలోని వివిధ తరగతులలోని పాత్రలు ఈ

పనివాళ్ళ శ్రమతో సంపదలు సృష్టించుకునే భూస్వాములు, దొరలు ఆ సంపదలో ఏ కొద్ది భాగమైన వాళ్ళు పొందడానికి ప్రయత్నిస్తే అందుకు లేశమాత్రమూ అంగీకరించరు. పైగా ఏదో ఒక సాకుతో వాళ్ళను శిక్షిస్తారు. ఉత్పత్తి సాధనాలను, వనరులను తమ అధీనంలో వుంచుకొని దోపిడీ, దౌర్జన్యాలు సాగించే భూస్వామ్య, పెత్తందారీ వర్గం, దోపిడీకి, దుర్భరమైన బతుకు పీడనకు గురవుతున్న ప్రజానీకంలోని వివిధ తరగతులలోని పాత్రలు ఈ నవలలో దర్శనమిస్తాయి.

ప్రతాపరెడ్డి లాంటి దొరలు, వారికి సహకరించే ముకుందరెడ్డి లాంటి చిన్న దొరలు, వాళ్ళ దుష్ట చర్యలకు సహకరించే బాలమల్లు లాంటి షేకీదార్లు, దొరలతో కలసిపోయి ప్రజలను దోచుకుతినే గౌరయ్యలాంటి పట్వారీలు, ఊళ్ళో వాళ్ళకు అప్పులిచ్చి వడ్డీలు పెంచి అదును చూసి వాళ్ళ ఆస్తులను దొరల ఆస్తుల్లో కల్సిపోవడానికి సహకరించే షావుకార్లు, దొరల ప్రయోజనాలను పరిరక్షించే ప్రభుత్వోద్యోగులు, పోలీసు అధికారులు, భూములు కోల్పోతున్న నర్సింహం లాంటి సన్నకారు రైతులు, భూములను అమ్ముకొని పోయే అయిలయ్యలు, కడుపాకలి తీరక ఆ కోపాన్ని భార్యలను కొట్టడంలో తీర్చుకునే చంద్రయ్య, బొత్తయ్యలాంటి పాలేర్లు, నీరటికాండ్లు, దొరలాడే నాటకంలో పావులయ్యే వెంకమ్మలాంటి అభాగ్య అమాయక స్త్రీలు, గుండె చెదిరిన వాడ్ని ఆదుకునే కల్లుగీసే గౌడ కులస్తులను పాత్రలుగా చేసి శ్రమ దోపిడీకి, భూస్వామ్య దౌర్జన్యాలకు గురయ్యే పేద ప్రజల జీవితాలను, అంతిమంగా వారిలో కలిగిన తిరుగుబాటు చైతన్యాన్ని అల్లం రాజయ్య "కొలిమంటుకున్నది" నవల సమగ్రంగా ఆవిష్కరించింది.

సెల్ : 9908803658

# గాయపడిన కవిత్వం

- మొగిలి స్వామిరాజ్

సెల్ : 9963642205



కాలమానపు కాగితాల మీదే కనుచూపు
పన్నెండవ పేజీ తిప్పడానికి లేదు
తొందొరిచ్చిన నందనం
గోడ మీదికి ముందే చేరింది.
క్రొత్త నామంతో... వస్తూ... వస్తూ...
క్రొంగొత్త భిక్షాటన పాత్రల్ని తెస్తోంది
కులపు కురుల్ని మట్టి ఊడలోలె
సాహిత్యం తమ సొత్తని విస్తరించుకోమంటోంది
మతోన్మత్తపు మత్తులో వత్సరమంతా జోగమంటోంది
తడారిన పెదాలపై పొడక్షరాల్ని
మలిన మనస్సుల్లో కవితా తోరణాల్ని
గుచ్చి... గుచ్చి... గుమ్మాలకు కట్టుకోమంటోంది
గాయపడిన కవి గుండెల గేయాలను
ఇరుకు గుండెలో ఇముడ్చుకోలేనందుకు
క్షంతవ్యురాలినంటోంది
అద్దెలాంతరు వన్నెలు పోతూ...
ఎన్ని హొయలొలుక బోసుకుంటే ఏం లాభం
కారుచీకట్లో మిరుమిట్లు గొలిపే మిణుగురే నయం
డాబు, దర్పంతో హోదాలు వేదాలు వల్లిస్తే ఏం లాభం
కష్టాల కడలిలో ఈదుతూ...
కన్నీళ్ళను దిగమ్రింగుతూ...
కడగండ్లతో చెలిమి చేస్తూ...
సమాజ స్థితిగతులే ముడిపదార్థంగ కవిత్వీకరిస్తే...
ఓ... జాలి లేని కాలమా..
ఈర్ష్యా, ద్వేషాలెందుకు నీకు
గాయపడిన గుండెతో రాయబడిన కవిత్వమిది

# హైకూలు

- రావెల పురుషోత్తమరావు

సెల్ : 9394100531



కటిక చీకటి
గుడిమెట్ల దారి
శిఖర దీప కాంతిలో మెరుస్తూ

పార్కులో
సిమెంట్ బెంచీపై
వాడిన పూలగుత్తులు

ఆమె వెళ్ళింది
గది నిండా
ఆ పరిమళమే గుభాళిస్తూ

శిథిల గృహంలో
రావి మొక్కలు
నివాసుల కోసం నిరీక్షణగా

దబాటు వాన
పూలబ్బాయ్
నవ్వే గంపతో

వాన వెలిసింది
గొడుగు క్రింద
నేనూ, రాలే చినుకులూ

హేమంతంలో
పర్వతాలను పలకరిస్తూ
నిశ్శబ్దం

దవనమో
మరువమో
పూలరాకను పరిమళిస్తూ

తూనీగ
నింగిలోని చినుకుల
నాహ్వానిస్తూ

వారాంతంలో
రహదారంతా పరుగెట్టే
కార్ల నక్షత్రాలు

## కథల పోటీ ఆహ్వానం

చైతన్య మానవి పత్రిక దశమ వార్షికోత్సవ సందర్భంగా వెలువరించే ప్రత్యేక సంచిక కోసం కథల పోటీ నిర్వహిస్తున్నట్లు సంపాదకులు ఒక ప్రకటనలో తెలిపారు. విద్యార్థిని, పౌరురాలు, మహిళ, శ్రామిక మహిళలకు సంబంధించిన అంశాలు కథాంశంగా ఉండాలని సూచించారు. ఎ4 సైజులో 2 పేజీలకు మించకుండా రాసిన కథలను జూన్ 30వ తేదీలోపు 'చైతన్య మానవి', అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా), రాష్ట్ర కార్యాలయం, బ్లాక్ నెం. 24, హెచ్ఐజి, 1-8-1, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్- 500 044 చిరునామాకు పంపించాలి. ఈ పోటీలో ఎంపికయిన కథలకు ప్రథమ బహుమతి రూ. 1,000/-, ద్వితీయ బహుమతి రూ. 500/-, తృతీయ బహుమతి రూ. 300/-లు, సాధారణ ప్రచురణకు ఎంపిక చేసిన కథలకు రూ.100/- అందజేయనున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు. ఇతర వివరాలకు 040-27605846, ఇ-మెయిల్: **chaitanyamanavi@gmail.com** ద్వారా సంప్రదించవచ్చు.

కథ

# పందులు

- జి. నరసింహమూర్తి



**జిల్లా కలెక్టరుగా కొన్ని ముఖ్యమైన ఫిర్యాదుల్ని మనసుతో చూసి హృదయంతో తట్టాను. అందులో మరో ముఖ్యమైనది గోదావరి దాపున సముద్ర తీరాన్ని కరిచిపట్టుకున్నట్టుండే రెండు మండలాలున్నాయి. అవేమిటో స్వయంగా చూసి రావడానికి ఉద్దేశపడి రెండు రోజుల ముందే ఆయా మండలాల తహశీల్దార్లకు తెలియజేశాను. ఇద్దరు ముఖ్యమైన ఆఫీసు సిబ్బందిని సంబంధిత ఫిర్యాదుల్నీ తీసుకుని తెల్లవారగట్లే హెడ్‌క్వార్టర్స్ నుంచి బయలుదేరాను.**

అక్కడ రకరకాల వ్యాధులు. అందులో మెదడువాపు వ్యాధి, మలేరియా, ఫైలేరియా వగైరాలు. సగం కూలిన ఇల్లు, చేనేత, ఇతర కులవృత్తులూ, రైతు కూలీల, రోజువారీ కూలీల సమస్యలు. ఒక్కమాటలో చెప్పాలంటే అవన్నీ పెత్తందారీ దళారీ, దోపిడీపరుల స్వార్థ క్రీడల సమాహారం.

కారు ధవళేశ్వరం వరకూ వచ్చేసింది. అక్కడే గోదావరి కృష్ణా జలసంపదని తన భుజస్కంధాల మీద మోసి కోట్లాది ప్రజలకు అన్నదాతగా పేరుగాంచిన ఆ కాటన్ దొర గుర్రం మీద కూర్చొని ఇంకా తన బాధ్యతల్ని అలుపెరుగకుండా నిర్వహిస్తున్నట్లు కనిపిస్తున్న అలనాటి ఉద్యోగిని చూసి మరోసారి స్ఫూర్తి పొందాను.

ఆర్థర్ కాటన్ ఇంగ్లీషువారి సైన్యంలో ఓ ఇంజనీరింగ్ అధికారిగా చేరి బర్మా యుద్ధంలో పాల్గొన్నాడు. ఆ తదుపరి మద్రాసు వచ్చాడు. ఇంజనీర్ అయిన ఆర్థర్‌కి ఆంగ్లేయ ప్రభుత్వం నదీ జల వనరుల నిర్వహణా బాధ్యతలు అప్పగించింది. నదీ జలాలు వృధాగా సముద్రం పాలవ్వకుండా సద్వినియోగం చెయ్యాలన్న భావనతో ఉన్న అతని ఆశయానికి తగిన బాధ్యత సమకూరింది. ఆనకట్టల నిర్మాణంలో రేయింబవళ్ళు శ్రమించాడు. నిత్య కరువు కాటకాల్నుంచి డెల్టా ప్రజల్ని రక్షించాడు. నిజమైన ప్రజా సేవకుడిగా తన కర్తవ్యం నిర్వహించాడు. తన విజ్ఞానాన్నీ, జీవన సాఫల్యాన్నీ భారత ప్రజలకర్పించాడు. ముఖ్యంగా డెల్టా ప్రజల గుండెల్లో స్థిరస్థాయిగా నిలిచిపోయిన ముద్దుబిడ్డ అయ్యాడు.

ఈలోగా నా కారు గన్నవరం అక్విడెట్ దాటింది.

నేను తనిఖీ చెయ్యాల్సిన ఆ రెండు మండలాల తహశీల్‌దార్లనీ, ముందుగా వచ్చే ఆ మండలి ముఖ్య కూడలిలో ఉండమని ఫోన్ చేయించాను. అక్కణ్ణుంచి తక్కిన ప్రోగ్రాం ఆలోచించుకోవచ్చని నా భావన. చెప్పిన ప్రకారమే తహశీల్‌దార్ సుబ్బారావు, మహిళా తహశీల్‌దార్ జయశ్రీ అకాడమీలో నాకోసం వెయిట్ చేస్తున్నారు.

నాతో ఉన్న సిబ్బందిని టీ బ్రేక్ కెళ్ళమన్నాను. నేను కారు దిగి తిన్నగా రోడ్డు పక్కనున్న కాఫీ అండ్ భోజన హోటల్‌లోని కెళ్ళాను. వెనుక ఎవరో 'కలెక్టర్ భరత్‌గారు' అనడం వినిపించింది. అంతా కలవరం ప్రారంభమయ్యింది. హోటల్ కిచెన్ అధ్వానంగా వుంది. అక్కణ్ణుంచి బయటకు ద్వారం. బయటకు చూస్తే పందికొక్కులూ, ఎలకలూ పట్టపగలే తిరుగుతున్నాయి. గ్లాసులూ, ప్లేట్లూ, చెత్తా, ఈగలు, దోమలు, కంపు.

నేను చెకింగ్ చేస్తున్నానని ఎవరో చెప్పడంతో తహశీల్‌దార్ సుబ్బారావు గబగబా వచ్చాడు.

అతన్ని చూసి "ఇంకా ఈ సెంటర్లో ఇటువంటి హోటల్స్ ఎన్ని ఉన్నాయి తహశీల్‌దార్‌గారూ" అడిగాను.

సరిగా చెప్పలేకపోతున్నాడు. హోటల్స్ తనిఖీ కూడా తన డ్యూటీల్లో ఒకటని అతనికి తెలియనట్టుంది.

ఇంకో రెండు హోటల్స్ తనిఖీ చేశాను. అవి కూడా అధ్వానంగా అపరిశుభ్రంగా ఉన్నాయి. తగిన చర్యకు ఆదేశాలిచ్చాను.

అక్కడ హోటల్స్, షాపుల్లోంచి వచ్చే వాడకపు నీళ్ళతో రోడ్డు పక్క చిన్న చిన్న నీటిగుంటలు, దుర్వాసన, అక్కడే ఆగే ఆర్టీసీ బస్సులు, ముక్కు మూసుకుని బస్సు లెక్కే ప్రయాణీకులు.

ఆ సెంటర్నుంచి అరకిలోమీటరు డ్రైనేజీ గతంలో వేయించిన రికార్డులున్నాయి. కాని అవేమీ ప్రస్తుతం కనిపించడం లేదు. గాంధీ ఆలోచన గ్రామ పంచాయతీ పాలనలో అవినీతి, అనైతిక శక్తుల చేతుల్లో కెళ్ళిపోయింది.



నేను కారెక్కుతుండగా వయస్సులో పెద్దతను వచ్చి నా కాళ్ళ మీద పడ్డాడు. భారత స్వాతంత్ర్య దేశంలో ఓ వృద్ధ పౌరుడు, తనకంటే చిన్నవాడయిన ఓ అధికారి కాళ్ళ మీద పడి తన గోడు వినిపించడం చూస్తుంటే పాలనా వ్యవస్థ తీరు స్పష్టంగా అర్థమవుతుంది.

"ఎవరీయన?" అడిగాను తహశీల్‌దారు సుబ్బారావుని ఆ వ్యక్తిని పైకి లేవనెత్తుతూ.

సుబ్బారావు ఆ పెద్ద వయస్సాయన్ని గుర్రుగా చూస్తూ "ఎరుకల రాముడు, పందుల్ని మేపుతూ ఈ ఊరికి పెద్ద న్యూసెన్స్ అయ్యాడు సార్."

"అది అతని కులవృత్తి. అతని జీవనాధారం" అన్నాను ఖచ్చితంగా.

ఓ పందులు మేపుకునే వ్యక్తిని వెనకేసుకొస్తున్నందుకు తహశీల్‌దారు నా ముఖంలోకి అలా చూడ్డం నాకు కొంచెం అనుమానం! అసహనం! నా కులమేమిటో అతనపుడే వాసన చూశాడని.

ప్రజల నుంచి కాక ప్రైవేట్ డాక్టర్ల నుంచి పందుల కారణంగా మెదడు వాపు వ్యాధి ప్రబలుతుందని ఫిర్యాదులున్నట్టు చెప్పాడు సుబ్బారావు. అది మెదడు వాపు వ్యాధి అని జిల్లా వైద్యాధికార్లు ఎవరైనా నిర్ధారించారా? అని అడిగితే మిగలముగ్గిన తాటికాయలా ముఖం పెట్టాడు.

ఆ వయస్సు మళ్ళిన వ్యక్తి తానంటూ తన గోడు వినిపించుకోవడానికి ధైర్యంగా ముందుకొచ్చాడు. ఓ కలెక్టర్ దగ్గరికి తన బాధని నిజాయితీగా చెప్పుకోవడానికొచ్చాడంటే, అతనిలో ఇంకా ఎన్నో నిజాలుంటాయనీ, వాటిని బయటకు లాగాలనీ నేను నిర్ణయించుకున్నాను.

"మీ పందుల పాకా, మీరూ ఎక్కడుంటారు?"

చెప్పాడు. కారెక్కమన్నాను. ఆయన "వద్దు బాబూ, మీ ఎనకాలే గబగబా వత్తాను" అన్నాడు.

"మీరు నాకు తండ్రిలాంటివారు. ఫర్వాలేదు. కారెక్కండి" అంటూ ఆయన చెయ్యి నా చేతిలోకి తీసుకున్నాను. ఆ చుట్టుపక్కలున్న వాళ్ళు చిత్రంగా మావైపు చూశారు.

కారు ఓ అరకిలోమీటరు మెయిన్ రోడ్డు మీద నడిచింది. తర్వాత దాన్నుంచి చీలిన చిన్న కంకరరోడ్డు. ఇంకొంచెం ముందుకెళ్తే ఓ పెద్ద మురుగుకాల్వ. అవతల పొలాల్లోకీ, వాటి మధ్య నుంచి అవతల గ్రామానికి వెళ్ళేందుకు నిర్మించిన శిథిలావస్థలో వున్న సిమెంట్ వంతెన. అటూ ఇటూ మలవిసర్జన చేస్తున్న మనుష్యులు. గట్టు మీద ఓ చోట చచ్చిన పశు కళేబరంపై పడి తింటున్న గద్దలు, కుక్కలూను. రాబందులు పడి పీక్కుతినేవి గతంలో. వాటి సంతతి అంతరించింది కాబోలనుకున్నాను. నాలుగడుగులు ముందుకేస్తే ఎవరో శవాన్ని కాల్చినట్టు, కాలిబూడిదైన ప్రదేశం. ఆ కాల్వ గట్టును శ్మశానంగా కూడా వినియోగిస్తారని అర్థమయింది.

అక్కణ్ణుంచి కాస్త దూరంలో ఓ పాకలాంటిది కనిపిస్తోంది. దానికి దిగువలో అయిదారు పందులు తిరుగుతున్నాయి.

డ్రైవర్ని కారు దగ్గరే ఉండమని సైగ చేశాను. ఎవరొచ్చినా కారు దగ్గరే ఉండిపొమ్మని నా మాటగా చెప్పమని చెప్పాను. ఎందుకంటే ఆ ముసలాయనా నేనూ మాట్లాడుకునేటప్పుడు ఇతరుల ప్రమేయం ఉండకూడదని.

నేను ఎరుకల రాముడు నివసించే పాకను సమీపించాను. గట్టిగా గాలేస్తే పాకమీద ఆకులు లేచిపోయేలా వున్నాయి. పాకలో అతని భార్య, పెళ్ళీడుకొచ్చిన కూతురూ ఉన్నారు.

కాలవకి దిగువలో హాస్పిటల్‌కి సంబంధించిన సిరెంజిలూ, బాండేజీలూ, వ్యర్థ పదార్థాలూ గుట్టలు గుట్టలుగా ఉన్నాయి.

"ఇవన్నీ ఇక్కడ ఎవరు పారేశారు?" ప్రశ్నించాను.

"అదిగో, ఇక్కణ్ణుంచి కనిపిత్తుంది, ఆ పెద్ద రోడ్డుకి చేరి ఉన్న ఆసుపత్రోళ్ళు బాబయ్యా" సమాధానమిచ్చాడు రాముడు.

"పోనీ ఆ చెత్తంతా ఇక్కడకు తెచ్చి కాల్చి పారేస్తారా?"

"ఏదని కాలుత్తారు, ఎంతనీ కాలుత్తారు, కడుపులోంచి లాగేసిన నెలలు నిండని పసిగుడ్డులుంటాయి. పురుడు తర్వాత నచ్చిపోయిన పిల్లలుంటారు. కావాలని నంపేసే ఆడ పసిగుడ్డులుంటాయి. ఇయన్నీ అనేక తూర్లు, పెద్దోళ్ళకీ, పోలీసోళ్ళకీ, తహశీల్‌దార్ గారికీ సెప్పాను. కడకి జరిగిందేమిటి? నా పందుల వల్లే ఈ ఊళ్ళో మెదడువాపు జబ్బు వొస్తుందనీ, రోగాలొత్తున్నాయనీ నన్ను ఎక్కడికైనా పొమ్మన్నారు. పందులకి మందెట్టి సంపేశారు ఎవరో. ఈ చుట్టు పట్ల ఏం జబ్బొచ్చినా అది నా పందుల వల్లేనని నన్ను ఈ ఊర్లో బతకనీయడం లేదయ్యా" అన్నాడు దిగులుగా.

దీంతో నా గుండె రగిలింది. నా సెంటిమెంట్స్ కంట్రోల్ చేసుకోలేక పోయాను. నేను పుట్టిన నా జీవన లోతుల్లోకి, నా పుట్టుక మూలాల్లోకి వెళ్ళాయి నా జ్ఞాపకాలూ, అనుభూతులూను.



పందులోళ్ళం. మమ్మల్ని ఊళ్ళో ఉండనీయరు. ఊరు బయటా బతకనీయరు. అన్ని జీవుల్లాగే పందులూను. జీవకారుణ్యం గురించి మాట్లాడేవాళ్ళే గాని చేతలు శూన్యం. ఏకలవ్యుడు ఎరుకల కులం కనుకనే అతనికి విద్య నేర్పేందుకు ఏ గురువూ ముందుకు రాలేదు. కాని అతనిలో నైపుణ్యానికి అడ్డుగోడలు కట్టలేకపోయారు.

కుల హద్దుల్ని ఛేదించాలంటే విద్య కావాలి. విద్య కావాలంటే ఆర్థిక స్థోమతు అవసరం. ఊరు బయట ఉంటూ పందుల్ని మేపుకుంటూ ఇంజనీరింగ్ కాలేజీ కెళ్ళాను. వాటిని సంరక్షిస్తూ, వాటి ఆదాయంతోనే చదువు సాగించాను.

"ఇంజనీరింగ్ చదువుతూ పందుల్ని కాస్తావా?" అని చాలామంది అడిగారు.

అందులో తప్పులేదని నాకు తెలుసు. తమ తమ కులవృత్తుల ప్రకారం స్వాతంత్ర్యంగా బతికే హక్కు అందరికీ వుంది.

తర్వాత నేను ఇంజనీరయ్యాను. హైదరాబాద్ స్టేట్ గవర్నమెంట్ ఉద్యోగంలో చేరాను. కాని నాకు ప్రత్యక్షంగా ప్రజల కష్టాల్ని పంచుకునేందుకూ, పరిష్కరించేందుకూ అవకాశం కావాలంటే కలెక్టరవ్వడం ఒక్కటే మార్గం. ఐ.ఎ.ఎస్. అయ్యేందుకు కష్టించాను. సెలక్టయ్యాను. కలెక్టరుగా నా ఆశయం నెరవేరింది.

ఎరుకల రాముడు బతుకుతున్న ఆ శ్మశానం గట్టున, ఆ పాకలో ఆ పందులోళ్ళలో నా తాత, ముత్తాతల మూలాలున్నాయి. ఆ పునాదుల్లోంచే నేను పుట్టి ఎదిగాను. నేనెవర్నో, నా కులమేమిటో, నా తల్లిదండ్రులెవరో ఎరుకల రాముడికి చెప్పాను. అతని భార్య నా అమ్మ లాంటిది. అతని కూతురు నా సహోదరి లాంటిది.

ఎంత వెదికినా, ఎంత తవ్వినా ఏ అధికారికీ దొరకని కొన్ని కరుడుగట్టిన నిజాలు ఎరుకల రాముడి ద్వారా తెలుసుకున్నాను. ఇపుడవన్నీ సాక్ష్యాలతో చూడాలి.

కారెక్కుతూ డ్రైవర్‌తో "సెంటర్లోంచి వెళ్ళి, అక్కడ ఆదివారం సంత మార్కెట్ రోడ్డుకి పడమరగా ఉన్న మట్టిపుంతకు పోనీయ్. అంటే అది అల్లూరి వారి మెరకకు వెళ్ళే పుంత" అన్నాను.

నా కారు మెయిన్ రోడ్డంట కాకుండా పక్క పుంతలోకి నడవడం చూసి తక్కిన సిబ్బందికి కంగారయ్యింది.

అటుగా కార్లు రావడం చూసి పుంతలోకి బహిర్భూమి కొచ్చిన ఆడవాళ్ళు సిగ్గుతో లేచి నిలబడ్డారు.

తహశీల్దార్ జయశ్రీని పిలిపించాను.

"ఈ పుంతలో మీ మండలం పది లక్షలు పెట్టి మరుగుదొడ్లు కట్టించినట్టు రికార్డుల్లో చూశాను. ఆ మరుగుదొడ్లు ఎక్కడున్నాయో చూపిస్తారా?" ప్రశ్నించాను.

"ఈ ప్రాంతంలో కోయలూ, ఎరుకలూ పందుల్ని మేపుతుంటారు. అవి కూలగొట్టేశాయని వార్డు మెంబరు రిపోర్టిచ్చాడు సార్" అంది జయశ్రీ.

పోనీ కూలగొట్టబడ్డ మరుగుదొడ్ల పునాదులు చూపించమన్నాను. పది నెలలైనా కాకుండా పదిలక్షలు ఖర్చు పెట్టి కట్టించిన మరుగుదొడ్లు ఏమయ్యాయి. పుంతలో ఆడా మగా మలవిసర్జన చేయడమేమిటి?

ఇందుకు బాధ్యుడైన పంచాయతీ ప్రెసిడెంట్ సమాధానమేమిటి?

మరో ముఖ్యమైన రహస్యం ఛేదించాలి. ఎరుకల రాముడు నాకు చెప్పిన ఆనవాళ్ళు వెదుకుతూ కారు దిగి నడుస్తున్నాను ముందుకు. నేను దేనికోసం వెదుకుతున్నానో, నాకూడా వచ్చే చాలామందికి అర్థం కావడం లేదు.

కొంతదూరం వెళ్ళిన తర్వాత ముళ్ళ పొదలు, బ్రహ్మజెముడు, ఏపుగా పెరిగిన పనికిరాని చెట్లు, చుట్టూ ముసుగు. అక్కడే దిగువలో పెద్ద గొయ్యి, వర్షంతో నిండిన నీరు. కాకులు, గద్దలు. ఆ గోతిలో ఓ శిశువు శవం. దానిని పొడుచుకు తినే కాకులు. గోతి బయట శిశువు కాలో, చెయ్యో ఆనవాలు దొరకడం లేదు. దానిని పీక్కుతింటున్న ఓ గజ్జి కుక్క. వాటికి దగ్గర్లోనే ఆసుపత్రి నుంచి వెలువడే వ్యర్థ పదార్థాలూ, బ్యాండేజీలూ, సిరెంజ్‌లూ, ఇంజెక్షన్ వైల్సూనూ.

తహశీల్దార్ జయశ్రీని అదంతా నోట్ చేసుకోమన్నాను. పోలీసు ఇన్‌స్పెక్టర్ కూడా అక్కడే ఉండటంతో తదుపరి చర్యకు ఆర్డరేశాను. అక్కడికి దగ్గర్లోనే హాస్పిటల్ నడుపుతున్న భార్యాభర్తలు

# అమ్మా! నీకో కన్నీటి చుక్క!

- ఎన్.సిహెచ్. చక్రవర్తి
సెల్ : 93999 58069

ఎన్నోమార్లు ఆ ద్వారం తెరచుకుంది
సంజీవనీమార్గంలా
కానీ ఈమారు ఆ గాజు గుమ్మమే
నా గుండెను గాజుబొమ్మను చేసి శిలలు రువ్వింది
మృత్యుకుహర ద్వారమై వికటంగా నవ్వింది
ఊపిరి ప్రోది చేసుకొని గుండె దిటవుగా
దర్పంగా నడచివచ్చే నా తల్లిని
చూడాలని ఎదురుచూసిన నా తపన కళ్ళకు
కన్నీరు పొరలు పొరలుగా తెరలు కప్పింది
ఇంటికి తీసుకుపొమ్మన్న
నీ కోరిక తీర్చేసరికి
నందనమే నీ ఇల్లైంది... భూమే చిన్నబోయింది
మంచుగడ్డలు కడుపులో పెట్టినట్టున్నదన్నావు
నీ మనసే నీ కడుపులో ప్రతిధ్వనించింది
నీవు పోరాడిన నేలతల్లి నిను నిద్రపుచ్చింది
మృత్యువుతో అసువుల పోరాట జీవుని ఆరాటం
చివరకు మృత్యువే జయిస్తుంది
ఎవరూ పిలవకపోయినా వదలని అతిథిలా
బోసిపోయిన ఈ ప్రకృతిలో నీవు వసంతమై నిండుదనం తేవాలి
జీవం రాలిన నా యింటిలో నీవు పునరాగమించి నిత్యకల్యాణం చేయాలి
నీవు వెతుక్కుంటూ వెళ్ళినదారి మళ్ళీ నా దారిగా మారి
మంగళనాదం వినిపించాలి
అన్ని పండుగలలో అన్ని వేడుకలలో
నీవు పచ్చతోరణమై భాసించాలి
బిందువైన నాకో రూపమిచ్చి ఇంతవాణ్ణి చేసిన
అమ్మా! నీకో కన్నీటి చుక్క



డాక్టర్ నరహరి నుంచీ, డాక్టర్ రమాదేవి నుంచి వాళ్ళ సమాధానం ఏమిటో తెలుసుకుని కేస్ బుక్ చెయ్యమన్నాను.

అక్కడున్న తక్కిన రెవెన్యూ సిబ్బంది, వార్డు మెంబర్లూ ఆశ్చర్యంగా నా వైపు చూశారు. నేను చిన్నగా నవ్వి "డాక్టర్ నరహరి ఈ ఊరు కోటీశ్వరుని కొడుకు కావచ్చు. డాక్టర్ రమాదేవి డైమండ్స్, జ్యూయలరీ షాపు ఓనర్ కూతురు కావొచ్చు. ఊరికీ, సమాజానికీ జరుగుతున్న హాని గుర్తించండి. వైద్యులే రోగాల్ని ప్రజల్లోకి విస్తరింపచేస్తూ ఆ తప్పును పందుల మీదకి నెట్టేయడం న్యాయమేనా?" అని ప్రశ్నించాను.

నేనేంటో ఈ పాటికి వాళ్ళందరికీ అర్థమై ఉంటుంది. అందుకే వాళ్ళెవరూ మాట్లాడటానికి సాహసించలేకపోతున్నారు. అలాగని తప్పును ఖండించే ధైర్యం కూడా ఎవరూ చూపడం లేదు. అటువంటప్పుడు సమాజంలో మార్పు ఎప్పుడొస్తుంది!?

నా కారుని చేనేత కార్మికులు నివసించే ఓ కాలనీకి వెళ్ళమన్నాను. వాళ్ళ వైపు నుంచి కూడా ఫిర్యాదులున్నాయి.

అది చేనేత కార్మికులుండే చిన్న కాలనీ. పల్లపు చేలలో నిర్మాణం జరిగిందనిపించారు. అంతా నీరు. నట్టింట చెమాయింపు. మగ్గం గోతుల్లో రెండు జానల ఎత్తున నీరు కారణంగా నేత పనులు లేవు. ఆకలి, రోగం. బట్టలు నేసే కార్మికుడు ఒంటి నిండా బట్టలేక చలి వల్ల వణికే ఎముకల గూళ్ళు. పాలిపోయిన స్త్రీలు. ప్రసూతి రోగాలు.

అక్కడో ప్రభుత్వ ప్రైమరీ హెల్త్ సెంటర్ మాత్రం ఉంది. అందులో పనిచేయడానికి ఏ డాక్టరూ రాకుండా చేసేసిన డబ్బున్న ప్రైవేట్ డాక్టర్ల బంధువర్గం.

క్షామంతో తల్లడిల్లే డెల్టాని సస్యశ్యామలం చేసేందుకు పొరుగు దేశం వాడైన ఆర్థర్ కాటన్ కృషి చేశాడు. కాని లోపం ఎక్కడ? గ్రామసీమల్లో స్వార్థపరులూ, దోపిడీదారులూ పెరిగిపోయారు. కాని కాటన్ దొర అందరికీ పూజ్యనీయుడెందుకయ్యాడు?

రెండు మండలాలూ తిరిగి చూశాను. ఎడతెగని సామాజిక సమస్యలు, ఎత్తుగడలు. దీనికి బాధ్యులెవరు?

సాయంత్రం రెండు మండలాల పంచాయతీ, రెవెన్యూ ఆరోగ్య సిబ్బందితో పాటు, వార్డు మెంబర్లను కూడా సమావేశానికి హాజరయ్యేటట్లు చేశాను.

గ్రామాలలో నెలకొన్న సమస్యలన్నీ చర్చిస్తూ "సర్ ఆర్థర్ కాటన్"లా ఉద్యోగులంతా ప్రజాసేవకు అంకితమవ్వాలి... అలాగే ప్రజల సహకారం తీసుకోవాలి. మన గ్రామ సమస్యలు పరిష్కారం కావాలన్నా, మనల్ని వెంటాడుతున్న ఆరోగ్య సమస్యల్ని అధిగమించాలన్నా ఏం చేస్తే మంచిదో మీరు సూచించండి" అన్నాను.

అక్కడున్న చాలామంది "సార్! పందుల వలన ఈ రెండు మండలాలూ నాశనం అవుతున్నాయి" అన్నారు.

ఇంతలో ఎవరో వికలాంగుడు తన బోటు కర్రలతో ముందుకొచ్చి "సార్! అశుద్ధం తినే నాలుగు కాళ్ళ పందుల వలన యే నష్టమూ లేదు. కాని! అన్నం తినే రెండు కాళ్ళ పందులే ఎక్కువ ప్రమాదకరంగా వున్నాయి" అన్నాడు.

నా ప్రశ్నకు సరైన సమాధానం వచ్చినందుకు ఇక ఆ దిశగా చర్య తీసుకునేందుకు గట్టి నిర్ణయం తీసుకున్నాను.

సెల్ : 8977987266

(ప్రైవేటీకరణ - ప్రపంచీకరణ - హైందవీకరణ)

# ప్రపంచీకరణతో పెరిగిన దేవుని వ్యాపారం

- యం. రేణుక




ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన జవహర్‌లాల్ నెహ్రూ కేంద్ర విశ్వవిద్యాలయం ఆచార్యులు మీరానందా 2009వ సంవత్సరంలో "The God Market - How Globalisation is making India more Hindu" అనే పుస్తకాన్ని ఐదు అధ్యాయాలలో రాశారు. ఈ పుస్తకాన్ని సత్యశోధన తెలుగులోకి స్వేచ్ఛానుసరణ చేశారు. ఈ ఐదు అధ్యాయాలతో పాటు ఇటీవల ఆంధ్రజ్యోతి దినపత్రికలో 'సాములోరి సిత్రాలు' పేరుతో వచ్చిన వ్యాసాలను మరింత మెరుగుపర్చి వాటిని జోడించి మొత్తంగా ఆరు అధ్యాయాలుగా విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు అచ్చువేసారు. ఆ పుస్తకము పేరే **"సంతలో దేవుడు".**

మనిషికి దైవత్వాన్ని అపాదించడంపై భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికి ప్రాచీన కాలం నుంచి నేటి వరకు దైవత్వం అపాదించబడిన లేదా సాక్షాత్ పురుషులుగా లేదా స్త్రీలుగా చెప్పబడుతున్నదంతా బాబాలమయమే. అయితే ప్రాచీన కాలంలో జన సమూహాలకు దూరంగా ఉంటూ, రాజులు లేదా ఇతర పోషకుల నుంచి కానుకలు స్వీకరిస్తూ తమ మాటలనే శాసనాలుగా, శాస్త్రంగా జనాల్ని నమ్మించి పబ్బం గడుపుకొన్న చరిత్ర బాబాలది. శాస్త్ర, సాంకేతిక రంగాల కారణంగా అభివృద్ధి చెందిన ప్రసార మాధ్యమాల ప్రభావంతో, అక్షరాస్యతా రేటు పెరిగిన ఆధునిక సమాజంలో రూపాలు మార్చుకొని మరింత స్వార్ధమయమై, రాజకీయ శక్తులతో, కార్పొరేట్ శక్తులతో కలిసి, మరింత క్రూరంగా మారి దేశంలోని లౌకిక రాజ్య వ్యవస్థకు గొడ్డలి పెట్టుగా మారుతున్న హిందూ మతోన్మాదంపై వెలువడిన విశ్లేషణాత్మక సంకలనమే ఈ పుస్తకం.

**మొదటి అధ్యాయం : ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ, భారతదేశం:** ఈ అధ్యాయంలో ప్రధానంగా ప్రపంచీకరణను "ప్రపంచ దేశాల మధ్య సన్నిహితమవుతున్న, విస్తరిస్తున్న సామాజిక సంబంధాలు, వాటి సాంద్రీకరణ పర్యవసానంగా మారుమూల ప్రాంతాలు కూడా ప్రభావితం అవుతాయన్న' గిడెన్స్ నిర్వచనాన్ని పేర్కొంటూ విశ్లేషించారు. ప్రపంచీకరణ శరవేగంతో జరిగిపోతుందనే వాస్తవాన్ని అంగీకరిస్తూ తద్వారా ఉత్పన్నమైన నయా సరళీకరణలో భాగంగా అవలంబిస్తున్న విధానాలు, పద్ధతులు, గతం కన్నా ఎందుకు లాభదాయకంగా మారాయో చర్చించారు.

పన్నులు చెల్లించే ప్రజానీకంతో నిమిత్తం లేకుండా ప్రజల శ్రమ ద్వారా నిర్మితమైన భారత ప్రభుత్వరంగ సంస్థలను ధ్వంసం చేయడం, వాటిని నడిబజార్లో అమ్మకానికి పెట్టడం, వాటిల్లో పనిచేస్తున్న లక్షలాది ఉద్యోగులు, శ్రామికుల కుటుంబాలు కుప్పకూలిపోతున్నా పట్టించుకోకుండా ప్రజాస్వామ్యయుతంగా ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధులు, వ్యాపార వర్గాలతో కుమ్మక్కై ఏ విధంగా మరో ప్రత్యామ్నాయం లేదంటూ జనం సొమ్ము అప్పనంగా అమ్ముకుంటున్న తీరునూ విశదీకరించారు.

స్వాతంత్ర్యానంతరం నెహ్రూ సామ్యవాద తరహా విధానాలతో ప్రారంభమైన ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యవస్థ 1991 నాటికి నయా ఉదారవాద సరళీకరణ విధానాల వైపు ద్రవ్య సంకోచం (Deflation), ద్రవ్య మూల్య హీనీకరణం (De-Value), ప్రభుత్వ సంస్థల అమ్మేయడం (De Nationalise), నియంత్రణల తొలగింపు (De regulate) మూలస్తంభాలుగా ఆర్థిక వ్యవస్థ పునర్నిర్మాణం వంటి విధానాల వైపు ప్రయాణించడాన్ని వివరించారు. మనిషికి కూడు, గూడు, గుడ్డతో పాటు విద్యా, వైద్య సదుపాయాలను కల్పించాలన్న నెహ్రూ కలల నుంచి అందినంత దోచి కార్పొరేట్‌లకు ఇవ్వాలనే సిద్ధాంతం వైపు ప్రభుత్వాలు ఎలా మళ్ళాయో వివరించారు. మత మూలాలను, ప్రభావాలను అర్థం చేసుకోవడానికి ప్రజల సామాజిక, ఆర్థిక జీవనాన్ని అవగాహన చేసుకోవడం అవసరం. జీవించడానికి అనువైన పరిస్థితులు లేనప్పుడు ప్రజల్లో మతావేశాలు, మానవాతీత శక్తుల యెడల నమ్మకాలు, మనిషికి తన మీద తనకే నమ్మకం లేనప్పుడు మతం మీద, దాని ప్రతినిధిగా ఉన్న దేవుడి మీద ఏర్పడుతుంది. సరళీకరణ, ప్రైవేటీకరణల ఫలితంగా అనిశ్చితి పెరిగి, అసంఘటిత రంగం విస్తరించి, రక్షణ లేక అభద్రతా భావంతో "దేవుడి మీద భారం" వేసి స్థితికి ఎలా నెట్టబడ్డారో చర్చించడం జరిగింది.

**రెండవ అధ్యాయం : మధ్యతరగతి మత విద్వేషాలు దేవుళ్ళ ప్రవాహం:** ఈ అధ్యాయంలో ప్రస్తుతం మన దేశంలో నడుస్తున్న మత పద్ధతులను, ఆచార వ్యవహారాలను గత కాలానికి పోల్చి విశ్లేషించారు. నెహ్రూ కాలంలో శాస్త్ర విజ్ఞానం, హేతుబద్ధత, ధ్యాన సమ్మతమైన హిందూ తాత్వికత ఆనాటి తరాన్ని, ప్రత్యేకించి మధ్యతరగతిని నడిపిస్తే దానికి భిన్నంగా ప్రస్తుతం మధ్యతరగతి ఆడంబరాలతో కూడిన ధూప దీప నైవేద్యాలు, విగ్రహారాధన, పుణ్యక్షేత్రాల దర్శనం, తీర్థయాత్రలు,

అధునాతన ఆచార వ్యవహారాలతో, వేషభాషలతో మత "ధర్మాలను" నెరవేర్చుతున్న వైనాన్ని కళ్ళకు కట్టినట్లుగా వివరించారు. గృహానికి, కుటుంబానికి పరిమితమైన మతాభిమానం, మతాచార వ్యవహారాలు నేడు ఏ విధంగా బహిరంగ ప్రదేశాలను ఆక్రమించిందో, రాజకీయ, సామాజిక రంగాలలో మతాభిమానం చొరబడిందో, ఆర్థికాభివృద్ధితో పాటు ఏ విధంగా కొత్త దేవుళ్ళను సృష్టించిందీ, బలీయమైన జాతీయ సాంస్కృతిక అనిశ్చితికి తెరతీసే విధంగా దేశంలోని హిందూ సంస్థలు పని చేస్తున్నాయో వివరించారు. మధ్యతరగతి ప్రజలు ఏ విధంగా ఆకర్షింపబడ్డారో కూడా చర్చించారు.

**మూడవ అధ్యాయం : రాజ్యవ్యవస్థ - మతం - కార్పొరేట్ పెట్టుబడిదార్లు విస్తరిస్తున్న హిందూ జాతీయ వాదం:** ఈ అధ్యాయంలో మతం ఏ విధంగా వ్యాపార వ్యవహారాలకు ఒక మంచి సాధనంగా ఉండే దశ నుంచి 'మతమే' ఒక వ్యాపార రంగంగా, పెట్టుబడి లేని వ్యాపారంగా, ప్రతిబంధకాలు లేని లాభసాటి వ్యాపారంగా మారిందో వివరించడం జరిగింది. దేశంలోని అత్యధికులైన హిందువులలో 90 శాతానికి పైగా ప్రజలు మత విశ్వాసాలు కల్గి ఉన్నందువల్ల దాన్ని ఒక ఓటు బ్యాంక్‌గా మార్చడం కోసం 'హిందూ జాతీయవాదం' పేరుతో ఏ విధంగా రాజకీయాలు నడుస్తున్నాయో, ధనిక, పేద తారతమ్యం లేకుండా దేవుళ్ళు, దెయ్యాల చుట్టూ తిరుగుతున్నారో, పూజారులను, జ్యోతిష్య శాస్త్రజ్ఞులను, వాస్తు విద్వాంసులను, ఆధ్యాత్మిక సలహాలిచ్చే కాషాయ గురువులను ఎలా ఆశ్రయిస్తున్నారో, తద్వారా ఇదంతా ఒక వ్యాపారంగా దిన దిన ప్రవర్ధమానమై ఏ విధంగా అభివృద్ధి చెందిందో వివరించడం జరిగింది. రాజ్యవ్యవస్థ - మతం - కార్పొరేట్ల మధ్య ఉండే అంతర్గత సంబంధం మూలంగానే విద్యా, పర్యాటక రంగాల్లోకి ఏ విధంగా ప్రైవేటీకరణ పేరుతో మతం చొరబడ్డదో వివరించడం జరిగింది. ఏ విధంగా వేద పాఠశాలలు, పూజారుల శిక్షణ, వాస్తు శిక్షణ, జ్యోతిష్య శిక్షణ కేంద్రాలు సెక్యులర్ విద్యా సంస్థల స్థానంలో కూర్చొని విశ్వ విద్యాలయ స్వయం ప్రతిపత్తిని పొంది, వేలాది ఎకరాల ప్రభుత్వ స్థలాన్ని ఉచితంగా తీసుకొని లౌకిక భావాలకు బదులుగా హిందూ జాతీయ వాద కేంద్రాలుగా తయారై పూజారి వర్గాన్ని సమాజాన్ని విశ్వాసాల్లో ముంచడం కోసం ఎలా వదులుతున్నదీ ప్రతిభావంతంగా విశ్లేషించారు.

*దేశంలోని అత్యధికులైన హిందువులలో **90 శాతానికి పైగా ప్రజలు మత విశ్వాసాలు కల్గి ఉన్నందువల్ల** దాన్ని ఒక ఓటు బ్యాంక్‌గా మార్చడం కోసం 'హిందూ జాతీయవాదం' పేరుతో ఏ విధంగా రాజకీయాలు నడుస్తున్నాయో, ధనిక, పేద తారతమ్యం లేకుండా దేవుళ్ళు, దెయ్యాల చుట్టూ తిరుగుతున్నారో, పూజారులను, జ్యోతిష్య శాస్త్రజ్ఞులను, వాస్తు విద్వాంసులను, ఆధ్యాత్మిక సలహాలిచ్చే కాషాయ గురువులను ఎలా ఆశ్రయిస్తున్నారో, తద్వారా ఇదంతా ఒక వ్యాపారంగా దిన దిన ప్రవర్ధమానమై ఏ విధంగా అభివృద్ధి చెందిందో వివరించడం జరిగింది.*

ఎలాంటి అరమరికలు లేకుండా పర్యాటక రంగం ద్వారా వచ్చే ఆదాయాన్ని ప్రజాహితం కోసం ఉపయోగించకుండా మత వ్యాప్తికి, ఆలయాల పునర్నిర్మాణానికి, ధర్మశాలల పేరుతో దుర్వినియోగ పరచడాన్ని కూడా పేర్కొన్నది.

**నాలుగవ అధ్యాయం : ఇండియా ఏ సూపర్ పవర డాట్ కామ్, భారత్ వెలిగిపోతుంది:** సాంకేతిక రంగంలో వస్తున్న మార్పులను ఉపయోగించి వేదాలకు ముడిపెడుతూ హిందూ మతానికి ఉన్నతీకరణం చేయడం గురించి, సంఖ్యాపరమైన ఆధిపత్య స్వభావం గురించి, నాగరికతల ఘర్షణ గురించి, ద్వేషపూరితమైన హిందూ మతోన్మాదం దేశంలోని 'భిన్నత్వంలో ఏకత్వం"కు ఏ విధంగా ప్రతిబంధకంగా మారి మైనారిటీ ప్రజలలో అభద్రతను కల్గించిందో, కొంతమందిని కారణంగా చూపుతూ ఇస్లాంపై, ముస్లింలపై గుడ్డి వ్యతిరేకతను, చాటుకుంటూ, సచార్ కమిటీ సిఫార్సుల్ని, గుర్తించ నిరాకరిస్తున్న వైనాన్ని ఈ అధ్యాయంలో తేటతెల్లం చేశారు.

**అయిదవ అధ్యాయం : లౌకిక కారణంపై పునరాలోచన:** ఈ అధ్యాయంలో దేవుడి మీద విశ్వాసం - మతం యొక్క సామాజిక ప్రాధాన్యత ఈ రెండు విషయాల సమన్వయం లేక మతోన్మాదం వైపు మరలడం అనేది ప్రపంచంలో శాస్త్ర జ్ఞాన సముపార్జన పెరిగే కొలది - ప్రపంచం పురోగమించే కొలది లోకాతీత శక్తులపై నమ్మకం క్రమేపీ తగ్గుతుందనే ఆధునిక సామాజిక సిద్ధాంతంకు వ్యతిరేకంగా ఉందన్న విషయాన్ని విశ్లేషించారు. సాంప్రదాయక సిద్ధాంతాల నుంచి బయటపడి లౌకికత్వాన్ని అనివార్యం ఎందుకు చేయాలో, విజ్ఞానం - సామ్యవాదం - లౌకికీకరణ ఏకమార్గంలో నడవడం వలన దేశానికి ఒనగూరే ఉపయోగాలు, హైందవీకరణను ఎలా ఎదిరించాలోకూడా విశ్లేషణాత్మకంగా చర్చించారు.

**ఆరవ అధ్యాయం :సంతలో దేవుళ్ళు - భావాల భాగవతం:** ఆంధ్రప్రదేశ్‌లోని గణపతి సచ్చిదానంద, కల్కి భగవాన్, బాలసాయి, కాళేశ్వర్, సుందర చైతన్య, మొదలైన బాబాల తీరును చర్చించడం జరిగింది. పేరేదైతేనేం ఇటువంటి బాబాల చరిత్ర అంతా నేరమయం అనేది, గత చరిత్ర ఎంత నేర ప్రవృత్తిని కల్గివున్నదో, ఎలా అక్రమంగా ఆస్తులు సంపాదించారో, ఎలా రాజకీయ నాయకులు తమ అక్రమ సంపాదనలు బాబాల దగ్గర జాగ్రత్తగా దాస్తున్నారో వివరించడం జరిగింది. మత్తుమందుల విచ్చలవిడి వినియోగం, వ్యభిచారం వంటి కార్యక్రమాలకు నిలయాలుగా బాబాల మఠాలు, ఆశ్రమాలు మారడాన్ని వివరించారు. పుట్టపర్తి సాయిబాబా మరణించినపుడు అక్రమంగా తరలిస్తూ కోట్లాది రూపాయలు దొరకడం, కాళేశ్వర్ అనుమానాస్పద మృతి, నటి రంజితతో అసభ్యంగా మరో బాబా వీడియోలో దొరికి అంతర్జాలంలో విహరించడం లాంటి సంఘటనలు జరిగిన ఈ తరుణంలో ఇలాంటి పుస్తకం తెలుగులో రావడం ఆహ్వానించదగింది. ఎందుకంటే కొంతవరకైనా బాబాల నిజస్వరూపాలపై సమాజాన్ని ఎడ్యుకేట్ చేయడానికి ఈ పుస్తకం ఉపయోగపడుతుంది. తప్పకుండా ప్రతి ఒక్కరు పడగ విప్పిన హైందవ నాగరాజును తెలుసుకోవడానికి ఈ పుస్తకాన్ని చదవాలి.

■

# మధ్యే మార్గం అంటూ ఉండదు

## - పంజాబి కవి పాష్

హిందీ మూలం : రాంజీ తివారి


పాష్

**పాష్** అసల పేరు అవతార్ సింహ్ సంధు. పంజాబ్‌లో జలంధర్ జిల్లాలో 1950లో పుట్టిన ఈ విప్లవ కవి జీవితం ఎన్నో అర్థాల్లో వైచిత్రభరితం. ఆయన జీవితం మనకు నేర్పే మొదటి పాఠం ఏమంటే సాహిత్యం ద్వారా కూడా హింసించేవాడి మొహంపై దెబ్బ కొట్టొచ్చు. ఆ దెబ్బ ఎంత మొహం జిల్లార్చుకుపోయేదిగా ఉండచ్చంటే హింసించేవాడు మీ ప్రాణాలు కూడా తీయగలడు. రెండో పాఠం ఏమంటే "జీవితాన్ని కొలిచే పద్ధతి ఎప్పుడు కూడా గుణాత్మకత అవుతుంది తప్ప పరిమాణాత్మకం కాదు."

పాష్ వామపక్ష భావాలు గల దోపిడీలేని సమాజం కోరుకునే ప్రజాకవి. అదే సమయంలో దోపిడీ పాలనకు వ్యతిరేకంగా పోరాడే యోధుడు కూడా. సిక్కు మతం ఆధారంగా ఖలిస్తాన్ కావాలనే వేర్పాటు ఉగ్రవాద ఉద్యమాన్ని ఆయన నిశితంగా ఖండించి వ్యతిరేకించాడు. వ్యక్తిగతంగా ఆయనకు ఎవరితోని వైరం లేదు. ఆయన కవితల్లోఉన్న విప్లవాత్మక గుణం, పదును ఇటు పాలకులకు, అటు ఖలిస్తాన్ ఉగ్రవాదులకు మింగుడు పడలేదు. ఉభయులకు ఆయన కవితాఝరి కంట్లో నలుసుగా నిలిచింది. పంజాబి ప్రజల్లో ఆయన "పంజాబ్ లోర్కా" (లోర్కా : గార్షియా లోర్కా. ఫ్రాంకో ఫాసిస్టు పాలనకు వ్యతిరేకంగా పోరాడి ఫాసిస్టు చేతుల్లో ప్రాణాలు కోల్పోయిన స్పానిష్ కవి)గా అమరుడై నిలిచాడు. కాని, ఖలిస్తాన్ ఉగ్రవాదుల చేతుల్లో 38 ఏళ్ళ ప్రాయంలోనే హతమయ్యాడు.

పాష్ కవితా ప్రస్థానం 15 ఏళ్ళ ప్రాయంలోనే మొదలైంది. 20 ఏళ్ళ నాటికి ఆయన మొదటి సంకలనం 'లౌహ్ కథా' వెలువడినప్పుడు ఆయన పంజాబ్‌లో ఒక కవిగా ప్రతిష్ఠితుడయ్యాడు.

పాష్ కవిత మన విప్లవ కావ్య పరంపర తాలూక అత్యంత ప్రభావవంతమైన, సార్థకమైన వెల్లడింపు. భావ వ్యక్తీకరణ. మనిషి ద్వారా మనిషి దోపిడీ మీద ఆధారిత వ్యవస్థ నాశనం, ఒక వర్గ విహీన సమాజ స్థాపన లక్ష్యంగా సాగుతున్న ప్రజా పోరాటాల పట్ల ఆయన పక్షపాతం చాలా స్పష్టం.

"చేతులున్నా అవి జోడించడానికి కావు
శత్రువుల ఎదుట ఎత్తేయడానికీ కావు
అవి మెడలు వంచడానికి కూడా ఉంటాయి
చేతులు ఉత్త శ్రమించడానికి ఉండవు
దోపిడీదార్ల చేతులు విరక్కొట్టడానికీ ఉంటాయి"

మన సమాజంలో ఏ భౌతిక యధార్థాన్ని పాష్ విశ్లేషించాలనుకుంటాడో దాని కొరకు తన భాష, నుడికారాలు, బింబాలు, ప్రతీకలు ఆయన గ్రామీణ జీవితం నుండి సేకరిస్తాడు. తనదైన పద్ధతిలో ఒక మెరుగైన మానవీయ సమాజం గురించి కాంక్షించే ప్రతి ఒక్కరు ఈ కవితల్లో మళ్ళీ మళ్ళీ దర్శనమిస్తూ ఉంటారు. తన ట్రేడ్ మార్క్ కవిత 'అన్నిటికంటే ప్రమాదకరం'లో ఆయన మనని ఇలా హెచ్చరిస్తాడు.

"శ్రమ దోపిడీ అన్నిటికన్నా ప్రమాదకరం కాదు.
పోలీసు దెబ్బలు అన్నిటికన్నా ప్రమాదకరం కాదు
ద్రోహం, లోభత్వం పిడికిలి అన్నిటికన్నా ప్రమాదకరం కాదు
... అన్నిటికంటే ప్రమాదకరం
వల్లకాటి శాంతితో నిండిపోవటం.
గిలగిలకొట్టుకోక అంతా సహించడం
ఇంటి నుండి పని కోసం బయల్దేరటం,
మరల పని నుండి ఇంటికి తిరిగిపోవటం.
అన్నిటికంటే ప్రమాదకరం కలలు చచ్చిపోవటం."

ప్రజల జీవితం నుండి స్ఫూర్తి పొందుతూ పాష్ కవితలు తిరోగామి విశ్వాసాలను స్పష్టంగా గుర్తిస్తాయి. తిరోగామి ప్రమాదాలున్న ప్రతి మలుపులో అవి మనల్ని హెచ్చరిస్తూనే అడపా తడపా ప్రక్కన నిలిచిన ప్రతి వ్యక్తితో వాటి సంవాదాన్ని కొనసాగిస్తాయి. "అంతా ఈశ్వరేచ్ఛ" అనే నుడికారాన్ని ఖండిస్తూ అవి ఇలా ప్రశ్నిస్తాయి.

# పొగ చూరిన దృశ్యాలు

- ఎస్.వి.ఎం. నాగ గాయత్రి

ఏమంటున్నావో...!
వినబడలేదూ...
పండగ కళనా...
మామిడాకుల గలగలలా..
తిరగమాత మోత...
కుక్కర్ కూత ఆగనీ..
కొత్తబట్టలా...!
ఈ ఉక్కపోతల్లోనా...!
సంతోషాలూ... సంబరాలూనా..!
సాంబారులో ఉప్పు...
కూరలో కారం.. రుచి చూడనా...
ప్రణాళికాబద్దమా?
మాకది లేదంటావా...!
అంటే ఏంటో... ఈ గరిటందుకో
తిప్పి చూపు... నేర్చుకుంటా...

చల్లగాలి... చందమామనా...!
ఎటు చూసినా నిండిన ఈ మసిలో
జాబిల్లిని ఉంచినా మసిబారిపోతాడు
కృష్ణశాస్త్రి కూడా వైరాగ్యం పాడతాడు

ఉమ్మడి కుటుంబం...
అద్భుతమైన సాంప్రదాయం...
ఒప్పుకున్నాను
పొగచూరిన ఆడాళ్ళని అడిగిచూడు
టీకా తాత్పర్యం ఇంకా బాగా చెబుతారు
అటు చూడు... ఏం దృశ్యం!



మగాళ్ళకు పొద్దుపోకనో!
ఆడాళ్ళకు పొద్దు చాలకనో!!
'రోజు' విసుక్కుంటూంది
అందరిదీ ఇదే దారి...
ఏడుస్తావెందుకంటావా?
మీ కడుపులు చల్లబడితే
మాకు మోక్షప్రాప్తి...
నేను కాదన్లేని నిజమే
కానీ...
మా మనసులు చల్లబడేది
మా మసి చేతుల్ని మీరు తుడిచినప్పుడే
ఫెమినిజం...
అంత పెద్ద మాటలెందుకులెద్దూ!
మానవత్వమంటే పోదూ...

---

"భగవంతుడిది ఇదెలాంటి కరుణ
గోధుమలు చెరుగుతూ పగిలిన చేతులు,
బజారులో చెక్కబల్లమీద కూర్చున్న
బుంగలాంటి మాంసం కుప్పపై (స్థూలకాయ షాహుకారు)
ఒకలాగే కురుస్తుంది..."

పాష్‌ని ఆయన జీవిత కాలంలో పాలకులు తక్కువ ఇబ్బంది పెట్టలేదు. ఆయన తన రచనల వలనే జైలు శిక్ష అనుభవించ వలసి వచ్చింది. ఉగ్రవాదులు ఆయన్ను తూటాలకు లక్ష్యంగా చేసుకోవడం యాదృచ్ఛికం మాత్రమే. ఎందుకంటే అసలు పాలకులే ఆ పని కానిచ్చేద్దామని అనుకున్నారనే వాదన కూడా ఉంది. పాష్‌కి కూడా దీని గురించి ఆలోచన ఉండింది. అందుకే ఆయన రాశాడు.

"నేస్తమా ఇక సెలవు
ప్రేమించడం, పోరాడగలగడం
జీవితంపై నమ్మకం ఉంచడం, నేస్తమా, ఇదే
ఎండలా భూమ్మీద వికసించటం
కౌగిలిలో కలిసిపోవటం
మందుగుండులా రాజుకోవటం
నలుదిక్కులా మారుమ్రోగటం
ఇదే జీవించే పద్ధతి, నేస్తమా
నేను పీకదాకా జీవితంలో మునగాలనుకున్నాను
కాని ఇప్పుడు నా వంతు కూడా జీవించేయ్,
నేస్తమా, నా వంతు కూడా జీవించేయ్..."

పాష్ రాసిన ఈ దీర్ఘ కవిత చదివితే కళ్ళు చెమ్మగిల్లుతాయి. పాష్ లాంటివాళ్ళు బతకడానికి తావులేని ఈ ప్రపంచాన్నే ఇష్టం వచ్చినట్టు శాపనార్థాలు పెట్టాలనిపిస్తుంది. ఆయన వద్ద ఒకటిని మించి ఒకటి శక్తివంతమైన కవితలున్నాయి. పంజాబీ నుండి హిందీలో తర్జుమా అయిన తరువాత కూడా వాటిల్లో ఎంత వేడి మిగిలివుందంటే ప్రజాపక్షాన నిలిచిన వారికి వాటి నుండి స్ఫూర్తి కలుగుతూనే వుంటుంది. "కామ్రేడ్‌తో సంలాపం" సీరీస్ కవితల్లో పాష్ ఒక విలక్షణ సామ్యవాద ఆలోచనాపరుడుగా మన ముందుకు వస్తాడు. అందుకే ఈ సీరీస్‌ని ఆయన సృజనాత్మక జీవన యాత్ర తారాస్థాయిగా భావిస్తారు.

23 మార్చి 1988 పాష్ కూడా తనకు ప్రియమైన అమరవీరుడు భగత్‌సింగ్ బాటలోనే పయనించాడు. అందుకు 57 ఏళ్ళ క్రితం అమరవీరుడు దేశ స్వాతంత్ర్యం కొరకు అసువులు బాసాడు. ఈ అద్భుత సంగమం ఈ తారీఖుకే అమరత్వం ప్రసాదించడమే కాకుండా, రాజకీయ కార్యకర్తలను, సాంస్కృతిక కార్యకర్తలను మానవ విలువల పరిరక్షణ పోరాటం నుండి విడదీయలేమనేది మనకు నేర్పుతుంది.

అంతిమంగా మనకు గుర్తొచ్చేది పాష్ ఇచ్చిన ఈ సందేశమే
మేము పోరాడతాము నేస్తమా
ప్రపంచంలో పోరాటం అవసరం ఉన్నంత కాలం
తుపాకి లేనప్పుడు కత్తి ఉంటుంది
కత్తి కూడా లేకుంటె పోరాట స్ఫూర్తి ఉంటుంది
పోరాడే తీరు లేకున్నా, పోరాడే అవసరం ఉంటుంది
మేము పోరాడతాము, నేస్తం
పోరాటం మినహా ఏమి దక్కదు
మేము పోరాడతాం.. మేము పోరాడతాం...

(పాష్ రాసిన పంజాబీ కవితల్ని జవహర్‌లాల్ యూనివర్శిటీ ప్రొఫెసర్ చమన్‌లాల్ హిందీలో అనువదించారు)

తెలుగు అనువాదం : **వేదుల రామకృష్ణ**

## దేశ విభజన నాటి విషాద ఘటనల సజీవ దృశ్యాలు

# సాదత్ హసన్ మంటో కథలు

- వీరప్రసాద్



సాదత్ హసన్ మంటో పేరు ఉర్దూ కథా సాహిత్యంలో ఒక సంచలనం. అతి తక్కువ కాలం జీవించి అసాధారణ ప్రతిభ చూపిన రచయిత సాదత్ హసన్ మంటో. కేవలం 42 సంవత్సరాల తన జీవిత కాలంలో 22 కథా సంకలనాలు, 7 రేడియో నాటికలు, మూడు వ్యాస సంకలనాలు, ఒక నవల రాసాడు. తన మొత్తం కథలు 250లో అనేకం సినిమాలుగా, నాటికలుగా రూపొందాయి. దక్షిణాసియాలోనే 20వ శతాబ్దపు అత్యుత్తమ ఉర్దూ కథా రచయితగా విమర్శకులచేత ప్రశంసలందుకున్నాడు. ఈ సంవత్సరం మే 11తో ఆయన శతజయంతి సంవత్సరం ప్రారంభమయ్యింది. 37 సంవత్సరాల సుదీర్ఘకాలం బ్రిటీష్ భారత్‌లో నివసించిన మంటో దేశ విభజన అనంతరం పాకిస్తాన్‌కు తరలి వెళ్ళాడు. చనిపోయేవరకు తన చివరి 5 సంవత్సరాల కాలం లాహోర్‌లో గడిపాడు. అత్యంత సంచలన రచయితగా మంటో జీవితం ఉవ్వెత్తున ఎగిసి తటాలున పడిపోయే కెరటం వంటిది. మంటో జీవిత చివరికాలమంతా అత్యంత వ్యథాభరితం. అత్యున్నత సంపన్న కుటుంబంలో పుట్టినా సామాన్యుల జీవిత ఘటనలను కథా వస్తువులుగా స్వీకరించాడు. అన్నింటికీ మించి దేశ విభజన సమయంలో ఇరుదేశాల ప్రజల మూఢత్వాన్ని నిష్పక్షపాతంగా తన కథలలో రికార్డు చేశాడు. ఆ కథలు చదివిన పాఠకలోకం నివ్వెరపోయింది. మనుషుల్లోని మృగప్రవర్తనకు సమాజం విస్తుపోయింది. దేశ విభజన, మత ఛాందసం మనుషుల్లో ఎంత దుర్మార్గానికి కారణమయ్యిందో తన కథలలో సజీవంగా చిత్రించిన అద్భుత రచయితగా మంటో నిలిచిపోయాడు.

పంజాబ్ రాష్ట్రంలోని లూథియానా జిల్లాలో సామరాల గ్రామంలో 1912 మే 11న జన్మించాడు మంటో. అతని తండ్రి బారిస్టరు. సబ్ జడ్జ్ ఉద్యోగం. మంటో తల్లి తన తండ్రికి రెండో భార్య. అమృత్‌సర్‌లోని ముస్లిం హైస్కూల్‌లో ప్రాథమిక విద్యనభ్యసించాడు. పదవ తరగతి మూడుసార్లు తప్పి నాలుగోసారి అత్తెసరు మార్కులతో పాసయ్యాడు. పాఠశాలలో సరిగా చదివేవాడు కాదు. ఉర్దూ మీడియంలో చదివినా ఆ సబ్జెక్ట్‌లోనే తప్పేవాడు. ఇంగ్లీషులో మాట్లాడటమన్నా, ఇంగ్లీషు చదవడమన్నా బాగా ఇష్టపడేవాడు. ఇంగ్లీషు నవలలు విపరీతంగా చదివేవాడు. ఇంట్లో డబ్బులు దొంగతనం చేసి ఇంగ్లీషు నవలలు కొనేవాడు. ఒకసారి అమృత్‌సర్ రైల్వే స్టేషన్‌లోని పుస్తకాల షాపులో ఓ పుస్తకాన్ని దొంగిలించి పట్టుబడిపోయాడు కూడా. ఇంగ్లీషు నవలలు చదవడం ఒక వ్యసనంగా ఉండేది. ఇంటర్ కూడా రెండుసార్లు తప్పి పూర్తిచేశాడు. పనీ పాటా లేకుండా కొంతకాలం ఖాళీగా తిరిగాడు.



పాకిస్తాన్ స్టాంప్

1930లో తండ్రి మరణించారు. ఆ సంఘటన మంటో మీద తీవ్ర ప్రభావం చూపింది. అదే సమయంలో అమృత్‌సర్‌లోని అలీఘర్ విశ్వవిద్యాలయంలో డిగ్రీలో చేరాడు. అక్కడ ప్రసిద్ధ ఉర్దూ రచయిత, అభ్యుదయ వేత్త అబ్దుల్ బరి అలీగ్ పరిచయం కలిగింది. ఆయన సాన్నిహిత్యం మంటోలోని ఆలోచానపరుడ్ని నిద్రలేపింది. అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘంలో చేరాడు. అబ్దుల్ బరీ అలీగ్ రష్యన్, ఫ్రెంచ్ రచయితలను మంటోకి పరిచయం చేశాడు. గోర్కీ, పుష్కిన్, విక్టర్ హ్యూగో, ఆస్కార్ వైల్డ్, చెహోవ్, మొపాసా, లార్డ్ లేటన్ రచయితలను విపరీతంగా చదివాడు. అబ్దుల్ బరీ అలీగ్ అనువాదం చేయమని ప్రోత్సహించాడు. వెంటనే రెండు వారాల వ్యవధిలో విక్టర్ హ్యూగో 'ద లాస్ట్ డేస్ ఆఫ్ కండెమ్డ్ మ్యాన్' పుస్తకాన్ని సర్గుజస్త్-ఇ-అసీర్ (ఎ ప్రిజన్ స్టోరీ) పేరుతో ఉర్దూలోకి అనువాదం చేశాడు. దానిని లాహోర్‌లోని ఉర్దూ పబ్లిషర్‌కి విక్రయించాడు. ఆ ఉత్సాహంలో ఆస్కార్ వైల్డ్ 'వెరా' నవలను ఉర్దూలోకి అనువదించాడు. ఆ పుస్తకం రచయితగా మంటోకి మంచి పేరును తెచ్చిపెట్టింది. మరికొన్ని రష్యన్ కథలను ఉర్దూలోకి అనువాదం చేశాడు. ఆ కాలంలోనే తన మొదటి కథను జలియన్ వాలా బాగ్ సంఘటన వస్తువుగా తీసుకుని రాశాడు.

అమృత్‌సర్‌లో 'మసావత్' దినపత్రికలో కొన్నాళ్ళు పనిచేశాడు. మంటోకి 24 సంవత్సరాలు వచ్చేటప్పటికి నాలుగు సంకలనాలు వెలువరించాడు. వాటిలో అనువాదాలతో పాటు ఒక స్వీయ కథల సంపుటి 'అతిష్ పారె' (స్పార్క్స్, క్వారెల్ - ప్రొవోక్స్) వెలువరించాడు. ఆ పుస్తకం పేరు కింద 'ఆలోచనలు రేకెత్తించే కథలు' అనే ట్యాగ్ వేసారు. మంటో ఉర్దూ కథాలోకంలో తన విశిష్టతను చాటడం ఆనాడే ప్రారంభమయ్యింది. అలీఘర్ విశ్వవిద్యాలయంలో చేరిన ఒక సంవత్సరంలోనే అది వదిలిపెట్టి లాహోర్‌కు, ఆ తర్వాత బొంబాయికి చేరుకున్నాడు.

# నందనం

- డా॥ రాజేశ్వరి



నిజం నిజంలా మిగిలిపోదు
నిజమేనా అనిపిస్తుంది
నిన్నటి బాధ తీరిపోతుంది
నేటి సుఖం మారిపోతుంది
ఉదయించిన సూర్యుని ముఖం
సరికొత్త బింబాలను ఆవిష్కరిస్తుంది
కనిపెంచిన అమ్మానాన్నల చిత్రపటానికి
ప్లాస్టిక్ పూలదండ వేలాడుతుంది
మమతల ఒడిని మరల
స్పృశించాలనుకునేసరికి
లామినేషన్ అడ్డు తగులుతుంది

ఎన్ని డాక్యుమెంటరీలను తీసినా
పాత స్మృతులు
తెరమరుగవుతాయే తప్ప
ఎదుట నిలిచి కనబడవు

డాడీ చేయి పట్టుకుని
బడిలో మొదటి అడుగుపెట్టిన అమ్మాయి
సంసారంలో పూర్తిగా మునిగిపోయి
తీరుబడి లేనిదయిపోయింది
ఫలశ్రుతిని పాడిన చెట్టుకొమ్మ
గోడ మీదకు వాలిపోయింది
చివరి విత్తనం నోట కరచిన పక్షి
ఎగిరిపోయింది
ఇలా తలంలో వేరూనిన
మొలక హరిత విప్లవానికి
మొదటి చిగురు వేసింది
శతకోటి నందనాలను
గర్భం దాల్చిన పుడమి
ఏమీ ఎరగనట్టు
నూతన ప్రసవానికి సిద్ధపడింది

---



బొంబాయిలో ముసావ్వర్ అనే సినీ వార పత్రికలో పనిచేశాడు. హిందీ సినిమాలకు స్క్రిప్ట్, డైలాగులు రాయటం ప్రారంభించాడు. ఆ సమయంలోనే కిషన్ కనహోయి, అప్ని నగరియా చిత్రాలకు పనిచేశాడు. 1939లో ఏప్రిల్ 26న సఫియాను వివాహం చేసుకున్నాడు. బొంబాయిని వదిలిపెట్టి 1941 జనవరిలో ఢిల్లీకి చేరుకున్నాడు. ఢిల్లీలో ఆకాశవాణిలో 18 నెలల పాటు పనిచేశాడు. ఆ కాలంలో 'ఆవో', 'మంటోకి డ్రామా', 'జనజ్', 'తీన్ ఔరతెన్' అనే నాలుగు రేడియో నాటికలు రాశాడు. మరో పక్క కథలు రాయడం కొనసాగిస్తూనే ఉన్నాడు. తన రెండో కథా సంకలనం 'ధూన్', మొదటి వ్యాస సంకలనం వెలువరించాడు. 1942లో ఆకాశవాణిని వదిలిపెట్టాడు. బొంబాయికి తిరిగి వచ్చి మళ్ళీ హిందీ చిత్రాలకు పనిచేయడం మొదలుపెట్టాడు. 'ఆట్ దిన్', 'చల్ చల్‌రే నవజవాన్', 'మీర్జా గాలిబ్' వంటి ప్రసిద్ధ చిత్రాలకు పనిచేశాడు. అప్పుడే 'ఛౌగాద్' కథా సంకలనం ప్రచురించాడు. 1947 విభజన తర్వాత 1948 జనవరిలో పాకిస్తాన్‌కు వెళ్ళేవరకూ బొంబాయిలోనే ఉన్నాడు. పాకిస్తాన్‌కు వెళ్ళవద్దని అతని మిత్రులు ఒత్తిడి చేశారు. ఆ సమయానికి బొంబాయి చిత్ర పరిశ్రమలోని పెద్ద డైరెక్టర్లతో, నిర్మాతలతో పనిచేస్తూ మంచి స్థితిలో ఉన్నాడు. పాకిస్తాన్‌లో చిత్రపరిశ్రమ అనాటికి అస్తవ్యస్తంగా ఉంది. అక్కడ మంటో ఇబ్బందులు ఎదుర్కొవచ్చని అతని మిత్రులు భావించారు. కానీ మంటో వారి మాటలు వినలేదు. తన కుటుంబాన్ని ముందుగానే లాహోర్ పంపించివేశాడు. ఆ తర్వాత తనూ ఆ బాటలోనే సాగాడు.

అప్పటికే విభజన కారణంగా లాహోర్ చేరుకున్న అనేకమంది ఉపాధి ప్రయత్నాల్లో ఉన్నారు. తొలిరోజుల్లో మంటోకి అవకాశాలు రాలేదు. క్రమంగా పరిస్థితులు మెరుగయ్యాయి. లాహోర్ చేరుకున్న అనేక మంది పత్రికలు ప్రారంభించారు. మంటో పత్రికలకు రాయడం ప్రారంభించాడు. ఆ సమయంలోనే 'ఖోల్ దో', 'ఠండా మీట్' కథలు రాశాడు. దాంతో ఛాందసవాదులు మంటోపై, ఆ కథలు ప్రచురించిన పత్రికలపై, సంపాదకులపై కేసులు పెట్టారు. ఈ సంఘటనతో మిగతా పత్రికలు మంటో రచనలు నిలిపివేశారు. మంటో కాలమ్స్‌ను ఆపివేశారు. దాంతో మంటో తీవ్రమైన ఆర్థిక ఇబ్బందులకు లోనయ్యాడు. త్రాగుడుకు అలవాటు పడ్డాడు. ప్రతీ ఒక్కరినీ డబ్బులు అడగడం చేసేవాడు. తన రచనలపై విమర్శలు వస్తే తీవ్రంగా స్పందించేవాడు. క్రమంగా అతనిని అందరూ దూరం చేయడం ప్రారంభించారు. మంటోకి ముగ్గురు కూతుర్లు. 1955 జనవరి 18న లాహోర్‌లో మంటో తన చివరి శ్వాస విడిచాడు. 2005లో 50వ వర్ధంతి సందర్భంగా పాకిస్తాన్ ప్రభుత్వం మంటో పేరున పోస్టల్ స్టాంప్ విడుదల చేసింది.

భారతదేశం కూడా సాదత్ హసన్ మంటో శతజయంతిని ప్రకటించాలని పలువురు భారత సాహితీవేత్తలు కోరుతున్నారు. అది సమంజసం కూడా. ఆయన అత్యంత జీవితకాలం గడిచింది పంజాబ్, బొంబాయిలలోనే. బ్రిటీష్ భారత్‌లో ఆయన అశ్లీల రచనలు చేస్తున్నందుకు గాను పలు కేసులను ఎదుర్కొన్నాడు కూడా. ఆయన రచనలు ఎంత వివాదాన్ని లేవనెత్తినా, అంతకు మించి మానవ ఆలోచనలను పదును పెట్టేవే. తన కథలలో ప్రధాన పాత్రలన్నీ మహిళలే. హిపోక్రసీతో నిండిన మనుషుల మనస్తత్వాల్ని తన రచనలో ఎండగట్టాడు. ముఖ్యంగా దేశ విభజన సమయంలో కీలక సంఘటనలను తన రచనల్లో నిక్షిప్తం చేసి సాహిత్యలోకానికి బహుమతిగా అందజేశాడు. ఈనాటికీ ఆనాటి దేశవిభజన సంఘటనల్ని మంటోకి మించి ఎవరూ రాయలేకపోయారంటే మంటో విశిష్టత తెలుస్తుంది. మంటో రచనలు ఎందరికో గుణపాఠాలుగా ఉంటయనడం అతిశయోక్తి కాదు. ఆయన తన చివరి కాలంలో దేశ విభజన సందర్భంగా సంభవించిన ఘటనల ఆధారంగా రాసిన 'ఖోల్ దో', 'ఠండా మీట్' 'టోబా టేక్ సింగ్' కథలు అత్యంత ప్రాచుర్యం పొందాయి. ఉర్దూ కథా సాహిత్యంలో తనదైన ముద్ర వేసిన సాదత్ హసన్ మంటో సాహిత్య ప్రపంచంలో విలక్షణ రచయితగా నిలిచిపోతాడు.



# మళ్ళీ మొలకెత్తనీకి

- ఐనాల సైదులు
సెల్ : 994714105



అప్పుడెప్పుడో
ఆరుమాసాల అవతల
వరికంకుల్ని కలగన్నాడు
మా అయ్య

ఆ కలల్ని మేసే పురుగుల్ని చంపనీకి
అమ్మ మెడల పుస్తెని తాకట్టు పెట్టి
వడ్ల రాసుల్ని పలవరించాడు

పురుగుమందుల కంపినోళ్ళు
పురుగుల్తో కల్సి
కథ నడుపుతున్న ఇసయాన్ని
పసిగట్టలేని మా అయ్య

పచ్చ జొన్నచేలో
తలెత్తుకు నిల్చునే కంకై
అంతా పచ్చ గుండాలనుకునే
పసిపిల్లోడు

గూడెం వాకిట్ల
బొమ్మరిళ్ళు కట్టుకొని
పసిపిల్లోళ్ళతో
ఆటాడుకునే
పిసరంత మనసున్నోడు మా అయ్య

దోసెడు నీళ్ళు తాగి
పొత్తిళ్ళలో బిడ్డను చూసినట్టు
ఎదుగుతున్న పంటను చూసి
మురిసిండు మా అయ్య
కోసి కుప్పేసి రాసి ఎగేసిన మా అయ్య
రాసులన్నీ
అప్పులకే కొలిసిపోశాక
హమ్మయ్య
అప్పు మిగల్లేదీ ఏడాదంటూ...
భూమి తల్లికి మొక్కి
సిద్ధపడ్డడు
మళ్ళీ మొలకెత్తనీకి...

---

# నానోలు

- జ్యోతిర్మయి మళ్ళ
సెల్ : 9296356220



విద్య
ప్రేమ
పంచుదాం
పెరుగుతాయి

స్వర్గం
త్రిశంకు స్వర్గం
ఇల్లు
స్త్రీ

అభాగ్యం
ధనలేమి
అగత్యం
ప్రేమ లేమి

జీవితకాలం
వెదుకులాట
ఫలితం
నేను

ఆమె
మహాకావ్యం
ఆఖరి పేజీ
అడ్రసే లేదు

నీరు
పల్లమెరుగు
నానో
నాణ్యమెరుగు

శిఖరం
అగాధం
ప్రేమ
చిరునామాలు

చిగురంత
దానం
తరువంత
ప్రయోజనం

కాలుష్యం
వైరస్
సుస్తీలో
భూగోళం

బెర్త్
ముందే రడీ
మరణం
బండిలో

సిన్సియారిటీ
పంక్చువాలిటీ
ఇన్స్పిరేషన్
శునకం

మనసిచ్చింది
ఒక్కసారే
కోల్పోయింది
కోటిసార్లు

నన్ను
వెదికాను
నువ్వు
దొరికావు

ఏకాంతం
సుఖమే
ఎదనిండా
నీవుండగా

ఆహ్వానం
ఆతిథ్యం
నోచుకోదు
మృత్యువు

# నానీలు

- డా॥ ఆచార్య గిడ్డి వెంకటరమణ



మూడే ముళ్ళు
ఏడే అడుగులు
దాని కోసం
ఎన్ని లక్షలో

పుణ్యభూమిలో
పుట్టిన పాపానికి
అర్ధభాగాన్ని
కొనుక్కోవాలి

నీళ్ళు తాగడానికి
నీళ్ళు నమలడం
దేనికి
మినరల్ వాటర్ మరి

గంగ
పరమ పవిత్రమే
తాకనంత వరకు
దూకనంతవరకు

అనువాద కథ

# పాక్ ప్యారీ



మూలం : సాదత్ హసన్ మంటో

అనువాదం : ఎ.జి. యతిరాజులు

**ఇండియా నుంచి ముస్లింలు, పాకిస్తాన్ నుంచి హిందువులు తమ నెలవులు వదలి మరోవైపు వలసలు పోతూనే ఉన్నారు. రెండు దేశాల్లోని పునరావాస కేంద్రాలు జనంతో క్రిక్కిరిసి పోయాయి. ఇక సూదిమొన మోపేందుకు కూడా చోటు లేనట్లయింది. అయినా సజీవులైన ప్రజలను ఆ పునరావాస కేంద్రాలలో కుక్కుతూనే ఉన్నారు. అందరికీ నామమాత్రంగా కూడా తిండి లభించడం లేదు. పారిశుద్య సౌకర్యాలు అంతంత మాత్రమే. అంటురోగాలు వేగంగా వ్యాపిస్తున్నాయి. అయితే వీటన్నింటి నుంచి ఆలోచించే వారు ఎవరూ లేరు. ఆ కేంద్రాలలో ఎక్కడ చూసినా గందరగోళం, క్రమశిక్షణా రాహిత్యం నిండిపోయాయి.**

అది 1948 సంవత్సరపు ప్రారంభ దినాలు. బహుశా అది మార్చి మాసంగా ఉండొచ్చు. ఇరుదేశాల్లోనూ ఎందరో స్వచ్ఛంద కార్యకర్తలు శరణార్థులకు సేవలందించేందుకు ముందుకొచ్చారు. వారు తప్పిపోయిన మహిళలను పిల్లలను వెదికి వారి ఆత్మీయులకు చేర్చే పని ముమ్మరంగా ప్రారంభించారు. నేను వారి నిస్వార్థ సేవలను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. వారి సేవలను చూసినప్పుడు నాకెంతో ఆనందం కలిగింది. అదివరకు సంబంధించిన మత కలహాలలో ప్రజలు చేసిన తప్పిదాలను వారు తుడిచేసేలాగా నాకనిపించింది. అయితే నాకో అనుమానం ఉంది. యువతులు, స్త్రీలు, పిల్లల అపహరణను మొదట వారెందుకు అడ్డుకోలేదు. తరువాత ఇప్పుడేమో మానభంగాలకు, హత్యలకు గురైన మహిళలను, వారి శవాలను కనుగొని వారి సంబంధీకులకు అప్పగించే పని ఎందుకు చేస్తున్నారు...?

ఆ మహిళలను మరింత హింసించకుండా, వారిని మరింతగా మానభంగం చేయకుండా, వారిపై మరింత అత్యాచారాలు జరక్కుండా లేదా వారిని మానసికంగా రక్షించేందుకు వారు ప్రయత్నిస్తున్నారా..? వారి గాయాలకు పూత మందు పూస్తున్నారా?.? ఈ స్వచ్ఛంద సేవకులు మానవ రక్తంతో కళంకితమైన తమ చేతులను ఇలాంటి సేవా కార్యక్రమాలకు కడుక్కుని అందరూ కూర్చుని భోంచేసేందుకా..? ఇతర ప్రజలందరూ కళ్ళు మూసుకున్నప్పుడు సామూహిక అత్యాచారాలకు బలైన మహిళల రహస్యాంగాలు బద్దలైనప్పుడు వాటిని మానవత్వమనే దారంతో కుట్టేందుకు ప్రయత్నిస్తున్నారా..?

అమాయకుడైన నేను దేనినీ అవగాహన చేసుకోలేకపోయాను. అయినా ఈ స్వచ్ఛంద సేవకుల సేవా కార్యక్రమాలు ప్రశంసనీయాలే.

వందల కొద్దీ కష్టాలు వారు ఎదుర్కోవాల్సి వస్తోంది. అసంఖ్యాకమైన అడ్డంకులను వారు అధిగమించాల్సి వస్తోంది. కిడ్నాప్‌కు గురైన వారిని కనిపెట్టడం సులభమైన పనేమీ కాదు. వారు ఒక చోట నుంచి మరో చోటికి వెళుతూనే ఉన్నారు. ఈ రోజు ఇక్కడుంటే, రేపు మరో చోట ఉంటున్నారు. పాపం స్వచ్ఛంద సేవలకు సైతం ఎవరూ సాయమందించేందుకు సిద్ధంగా లేరు.

నాకో ప్రభుత్వాధికారి ఒక విచిత్రమైన గాథను వినిపించారు. సహరాన్‌పూర్‌లో ఉన్న ఇద్దరు ముస్లిం స్త్రీలు పాకిస్తాన్‌లోని తమ తల్లిదండ్రుల వద్దకు తరలివెళ్ళేందుకు నిరాకరించారు. జలందర్ నగరంలో మరో మహిళ ఉంది. ఆమెను కిడ్నాప్ చేసిన దుండగులకు ఆమె కుటుంబీకులే సగౌరవంగా అప్పగించి పంపేశారు. తమ కోడల్ని వారు ఆమె తల్లిగారింటికి పంపుతున్నట్లుగానే ఆ దుండగులకు భయపడి వారితో పాటు యవ్వనం తొణికిసలాడుతున్న ఆమెను పంపేశారు. మరికొందరు మహిళలు తమ తండ్రులకు, భర్తలకు భయపడి

మార్గమధ్యంలోనే ఆత్మహత్యలు చేసుకున్నారు. ఇంకా కొందరు అకస్మాత్తుగా సంభవించిన ఈ అఘాయిత్యాలు చూసి తట్టుకోలేక పిచ్చివారైపోయారు. ఎందరో మహిళలు తాగుడుకు బానిసైపోయారు. దాహం వేసినప్పుడల్లా వారు నీటికి బదులు సారాయిని వెదుక్కుంటూ వెళ్ళి అది అందించిన పురుష పుంగవులకు తమ మానాన్నే అర్పించేశారు. వారితో మనం మాట్లాడితే వారి నుంచి బూతులు తప్ప ఒక్క మంచి మాట కూడా రాదు.

ఆ స్వచ్ఛంద సేవకులు దుండగుల నుంచి రక్షించిన బాలికలు, మహిళల గురించి నేను ఆలోచించినప్పుడల్లా నాకు ముందుకొచ్చిన వారి పొట్ట మాత్రమే గోచరిస్తుంది. ఈ పొట్టల, ఈ గర్భాల గతి ఏమవుతుంది..? ఆ గర్భాలలో ఏముంది..? అది పాకిస్తాన్‌గానో, ఇండియాగానో ఉంటుందా..? తరువాత వారు దానిని తొమ్మిది మాసాలు మోయాలి గదా..? అందుకైన జీతం ఎవరిస్తారు..? ఇండియానా, పాకిస్తానా..? లేదా వాటిని బాధ్యతారహితమైన పరిస్థితుల క్రూరత్వాలని పద్దుల పుస్తకంలో నమోదు చేసేస్తామా..? నిజానికి ఆ పద్దుల పుస్తకంలో ఖాళీ పేజీలేవైనా మిగిలున్నాయా..?

కనుగొనబడిన, రక్షింపబడిన స్త్రీలు వస్తున్నారు, పోతున్నారు.

నేను విస్మయంతో ఆలోచించేవాడిని. ఒక మహిళ ఒక పురుషునితో పారిపోతే సాధారణంగా ఆ మహిళను 'అపహరింపబడింది' అంటారు. ఒక పురుషుడు, ఒక స్త్రీ ఒకరినొకరు ఇష్టపడి ఇంటినొదలి పారిపోవటం సాహసకార్యమే. రెండు హృదయాలు ఏకమై ఒకే రాగం వెలువరించేటప్పుడు దాన్ని అడ్డుకోవడంతో సమస్య క్లిష్టమవుతుంది. అయితే ఏ పాపం ఎరగని ఒక అమాయకురాలైన యువతి దౌర్జన్యంగా ఒక గదిలో బంధించి ఉంచటాన్ని మనం 'ఆ యువతి ఇల్లొదిలి పారిపోయిందని' చెప్పటం సమంజసమేనా..?



అయితే మతకలహాల కాలం ఎలాంటి కారణకార్య సంబంధం లేని, ఏ తర్కానికీ, ఏ సిద్ధాంతానికీ కట్టుబడని కాలం. ఆ రోజుల్లో ప్రజలు తీవ్రమైన వేసవికాలమైన తమ ఇంటి తలుపులు గట్టిగా బంధించి తమను తాము ఇళ్ళల్లోనే బందీలు చేసుకున్నారు. అలాగే నేను సైతం నా మస్తిష్కంలోని అన్ని ద్వారాలనూ, కిటికీలను మూసేసుకున్నాను. వాస్తవానికి వాటిని నేను తప్పకుండా తెరచి ఉంచాల్సిన సమయమది. అయినా నన్నేమి చేయమంటారు..? ఇక నేను ఆలోచించదలచలేదు.

రక్షింపబడ్డ స్త్రీలు వస్తున్నారు. కాపాడబడ్డ స్త్రీలు పోతున్నారు.

ఈ రవాణా వ్యవహారం ఒక వ్యాపారంలాగే సాగుతోంది. రచయితలు, కవులు తమ కలాలు చేత పట్టుకుని విషయ సేకరణకు తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. అయితే వెల్లువలా వస్తున్న ఇలాంటి కథలు, కవితలు ఇంచుమించు తుఫానుగా సంభవిస్తున్న సంఘటనల ముందు నిలువలేక వెల వెల పోతున్నాయి. వాటిని చదివే పాఠకులు అయోమయానికి, ఆశ్చర్యానికి గురైపోతున్నారు.

ఒక ప్రభుత్వాధికారి నా ధోరణి చూసి 'మీరెందుకింత విచారగ్రస్తులుగా ఉన్నారు' అని అడిగారు. దీనికి జవాబేమీ చెప్పలేదు.

ఆ అధికారి నాకో వృత్తాంతం చెప్పారు.

'మతకలహాలలో అపహరణకు గురైన మహిళలను వెదుకుతూ మేము ఒక ఊరు నుంచి మరొక ఊరికి, ఒక గ్రామం నుంచి మరొక గ్రామానికి, ఒక ప్రాంతాన్నుంచి మరో ప్రాంతానికి ప్రయాణిస్తూనే ఉన్నారు. ఇలా అన్వేషణ కొనసాగిస్తూ మేము వెదుకుతున్న పగడాన్ని అందుకుంటాం.

నేను నా మనస్సులోనే ప్రశ్నించుకున్నాను. 'ఆ పగడం ముందులాగే పూర్తిగా ఉంటుందా..? లేక విచ్ఛిన్నమై ఉంటుందా..?'

ప్రభుత్వాధికారి చెబుతూనే ఉన్నాడు. 'మేమెదుర్కొనే కష్టాలు వివరించి చెప్పినా మీకర్థం కాదు. అయితే మీకు చెప్పవచ్చింది వేరే విషయం. ఎన్నోసార్లు మేము ఇండియా, పాకిస్తాన్ సరిహద్దులు అటు, ఇటు దాటెళ్లాం. అప్పుడల్లా ఆశ్చర్యకరంగా ప్రతిసారీ ఒక వయస్సు మళ్ళిన వృద్ధురాలిని చూశాను. ఆమె ఒక ముస్లిం మహిళ. బాగా వయస్సయింది. జలంధర్ నగరానికి వెలుపల నేను ఆమెను మొదటిసారిగా చూశా. ఆమె శారీరకంగానూ, మానసికంగానూ అత్యంత బలహీనురాలుగా ఉంది. ఆమె చూపు కూడా మందగించింది. ఆమె తలవెంట్రుకలు మట్టితో నిండున్నాయి. బట్టలు చిరుగులుగా మారిపోయాయి. ఆమె కళ్ళను గమనించినప్పుడు ఆమె దేనినో వెదుకుతున్నట్లనిపించింది. అయితే దేన్ని వెదుకుతోందని మాత్రం ఖచ్చితంగా చెప్పలేం. ఆ వృద్ధురాలికి షాక్‌తో పిచ్చిపట్టిందని మరో సోదరి నాకు తెలియజేసింది. వృద్ధురాలు పాటియాలా నగరానికి చెందింది. అక్కడ జరిగిన మతకలహాల సందర్భంలో ఆమె కుమార్తెను ఎవరో కిడ్నాప్ చేసి లాక్కెళ్ళారు. పెద్దామె ఎన్నో చోట్ల రాత్రింబగళ్ళు కూతురిని వెతికింది. అయినా కనుగొనలేకపోయింది. శక్తి మేరకు మేము సైతం గట్టిగా ప్రయత్నించాం. అయినా కనుక్కోలేకపోయాం. ఒకవేళ ఆమెను ఇదివరకే దుండగులు చంపేసి కూడా ఉండొచ్చు. అయితే వృద్ధురాలు దీన్ని ఒప్పుకోవటంలే.

రెండోసారి నేను ఈ ఉన్మాద మహిళను సహరాన్‌పూర్ బస్టాండ్‌లో చూశాను. ఇప్పుడు ఆమె పరిస్థితి మరింత దయనీయంగా ఉంది. ఆమె పెదవులు పగిలిపోయి వున్నాయి. తలవెంట్రుకలు మరింత చిక్కబడిపోయి ఉన్నాయి. భిక్షగత్తెలాగానే ఆమె కనబడింది. నేను ఆమెను సమీపించి 'మీ అమ్మాయిని వెదకడం ఇకనైనా మానుకోండి' అన్నా. అందుకోసం నేను నా మనస్సును బండరాయిని చేసుకుని 'అమ్మా, మీ అమ్మాయిని ఎప్పుడో చంపేశారు' అని అన్నా.ఆ పిచ్చామె నన్ను తదేకంగా చూసి 'చంపేశారా...? ఉండనే ఉండదు' అంటూ గట్టిగా అరిచింది. ఆమె స్వరం ఉక్కులాగా దృఢంగా వినిపించింది. 'నా కూతురిని ఎవరూ చంపలేదు. ఎవరి వల్లా కాదు.' అని చెప్పి మరలా తన అన్వేషణలో నిమగ్నమైపోయింది. నిజానికి ఆ అన్వేషణ ప్రయోజనం లేని అన్వేషణ అని నేను అనుకున్నా. అయితే ఆ వృద్ధురాలు తన కుమార్తెను ఏ 'కిర్పానో' (పెద్ద ఖడ్గం) లేదా పదునైన ఏ కత్తో నరికి చంపలేదనే ఆమె భావిస్తోంది. ఈ భావన ఆమెకు ఊహించలేనంత దృఢంగా ఉంది. ఆ అమ్మాయి చిరంజీవినా...? లేక ఆ అమ్మాయి పట్ల ఆ అమాయక తల్లి ప్రేమ శాశ్వతమైనదా..? తల్లి ప్రేమ - తల్లి వాత్సల్యం - ఎలా

ఉన్నా అది మరణం లేనిదే. ఒకవేళ ఆ వృద్ధురాలు దానినే వెదుకుతున్నదేమో. దానిని ఆమె ఎక్కడో పోగొట్టుకొన్నదేమో.

నా మూడో ప్రయాణంలో మరలా ఆమెను చూశాను. ఇప్పుడామె పూర్తిగా చింపిరి గుడ్డల్లో ఇంచుమించు నగ్నంగా కనబడింది. నేనామెకు కొత్త బట్టలు కొనిచ్చాను. అయితే ఆమె వాటిని తీసుకునేందుకు నిరాకరించింది. 'అమ్మా, నిజం చెబుతున్నా. మీ అమ్మాయిని పాటియాలలో ఎప్పుడో చంపేశారు' అన్నా. కానీ ఆమె ఉక్కులాంటి దృఢమైన తన విశ్వాసంతో 'కాదని' తల అడ్డంగా ఆడించింది.

'నీవు అమ్మాయి కోసం ఎన్నో బాధలు అనుభవించేశావు. నాతోపాటు వచ్చావంటే పాకిస్తాన్‌కు తీసుకెళతాను' అని నేను చెప్పాను. అయితే ఆమె నా మాటలను చెవికెక్కించుకోక ఎక్కడో చూస్తూ ఏదో గొణుగుతోంది. అకస్మాత్తుగా నిద్ర మేల్కొన్నట్లు కనిపించింది. ఇప్పుడామె స్వరం మరింత గట్టిగా ప్రతిధ్వనించింది. 'లేదు మా అమ్మాయి చనిపోలేదు. ఎవరూ నా కూతుర్ని చంపలేరు.'

'ఎందుకు చంపలేరు..?' అని నేను అడిగాను.

ఆ వృద్ధురాలు 'నా కూతురు చాలా అందమైంది. అంత అందమైన దాన్ని ఎవరూ చంపలేరు. చంపడం కాదు దాని చెంపపై ఎవరూ ఒక చిన్న దెబ్బ కూడా కొట్టలేరు' అంటూ వదరసాగింది.



నేను ఆలోచించసాగాను. ఆ అమ్మాయి నిజంగా అంత అందమైనదా..? ప్రతి తల్లీ తన సంతానాన్ని సాటిలేని వేటిగానే భావిస్తుంది. సూర్యచంద్రులు సైతం తన బిడ్డతో పోటీ పడలేరని భావిస్తుంది. ఒకవేళ నిజంగానే ఆ అమ్మాయి అత్యంత అందమైనదిగా కూడా ఉండొచ్చు. కానీ ఇప్పటిలాంటి ఉప్పెనలో, మనుషులు మొరటు పిడికిళ్ళకు చిక్కకుండా ఆ అందం మనగలదా..? ఈ వృద్ధురాలు తనకున్న నమ్మకంతోనే తన మనస్సును మోసపుచ్చుతుందేమో..? అయినా 'ఆవేదన' అనే కేంద్రంలో లక్షలాదిగా కాదు, కోటానుకోట్ల వీధులు ఒకదానితో ఒకటి ఢీకొని కలుసుకుంటున్నాయి.

నేను సరిహద్దులు దాటి ఎన్నోసార్లు పయనించాను. ప్రతిసారీ ఆ అమాయకమైన వృద్ధురాలిని చూశాను. ఇప్పుడామె కేవలం ఎముకల పోగుగా మాత్రమే వుంది. చూపు కూడా చాలావరకు తగ్గిపోయింది. పడుతూ, లేస్తూ దారిలో మెల్లగా నడుస్తోంది. ప్రస్తుతం తన కుమార్తె బతికే ఉందనే ఆమె నమ్మకం మరింత దృఢంగా ఉంది. అందువల్లే ఎవరూ తన కూతురిని ఏమీ చేయలేరని ఆమె భావిస్తోంది.

ఆ వృద్ధురాలితో మాట్లాడ్డం నిష్ప్రయోజనమని అక్కడున్న ఓ సోదరి నాతో చెప్పింది. ఆమెను తీసుకెళ్ళి పాకిస్తాన్‌లోని పిచ్చాసుపత్రిలో చేర్చడమే మంచిదని ఆమె నాతో అంది. కానీ నేను ఆ చర్య సరైంది కాదని భావించాను. ఆ వృద్ధురాలి జీవితం కేవలం తన కుమార్తె అన్వేషణలో మాత్రమే ఈనాడు నిలబడుందని, ఆ నమ్మకాన్ని కూడా మనం తొలగిస్తే ఆ ప్రాణాలు పోతాయని నేననుకున్నాను. అందువల్ల నాకది ఇష్టం లేదు. అదేగాక ఈ వెతుకులాటలో పాదాలు బొబ్బలు తేలినట్లు ఆమె తిరుగుతుండటమే మంచిదనుకున్నాను... ఎందుకంటే..? మానసిక వైద్యశాలలో ఆమెను చేర్పిస్తే, నాలుగు గోడల మధ్య బంధిస్తే ఆమెకపకారం మనం చేసినట్లే అనుకున్నాను.

చివరిసారిగా ఆమెను నేను అమృతసర్ నగరంలో చూశాను. ఆమె పరిస్థితి చెప్పలేనంత దారుణంగా మారుతుండటం చూసి నేను ఏడ్చేశాను. ఈసారి ఎలాగైనా ఆమెను పాకిస్తాన్‌కు తీసుకెళ్ళి వైద్యశాలలో చేర్పించాల్సిందే అని గట్టి నిర్ణయం తీసుకున్నాను.

ఆ ముదుసలి 'ఫారిత్' కూడలిలో అరకొర చూపుతో దేన్నో చూస్తూ నిలబడుంది. ఆ కూడలి జనసందోహంతో నిండుంది. నేను దుకాణంలో కూర్చుని పునరావాస కార్యక్రమం గురించి ఒక సోదరితో మాట్లాడుతున్నాను. ఆ సోదరి కిడ్నాప్ చేయబడ్డ ఒక అమ్మాయి 'సబోనియా' బజారులో ఒక సేట్ దగ్గర ఉందని చెబుతోంది.

మా సంభాషణ ముగిసినందువల్ల, ఇక ఎలాగైనా పెద్దామెను పాకిస్తాన్‌కు తీసుకెళదామని లేచాను. ఉన్నట్టుండి ఒక ఆడ, మగ జంట నన్ను దాటెళ్ళింది. ఆ యువతి తెల్లటి ముసుగు ధరించుంది. ఆమెతో పాటు అందమైన, బలిష్ఠమైన ఒక సిక్కు యువకుడు కూడా ఉన్నాడు. ఆ ఇద్దరూ వృద్ధురాలిని దాటెళ్ళుతుండగా ఆ యువకుడు కాస్త ఆగాడు. రెండడుగులు వెనక్కొచ్చి ఆ యువతి చేతిని గట్టిగా పట్టుకున్నాడు. ఇవన్నీ కొన్ని క్షణాల్లో జరిగిపోయాయి. ఈ మధ్యలో ఆ యువతి ముసుగు తొలగిపోయింది. ఆ అమ్మాయి ముఖం గులాబిరంగులో మెరిసిపోతుంది. అలాంటి అందాన్ని నా జన్మలో ఎప్పుడూ చూడలేదు.

నేను వారికి దగ్గరలోనే ఉన్నాను.

ఆ పిచ్చి వృద్ధురాలిని చూపుడువేలుతో చూపి ఆ సిక్కు యువకుడు ఆ యువతితో అన్నాడు. 'మీ అమ్మ...!'

ఆ అమ్మాయి ఒక్కక్షణం ఆ పిచ్చితల్లిని తిరిగి చూసింది. మరుక్షణం తన ముఖాన్ని తెల్లటి ముసుగుతో బాగా కప్పేసుకుంది. తన జతగాడి చేతిని గట్టిగా పట్టుకుని 'రా పోదాం' అని హీనస్వరంతో చెప్పింది.

ఇద్దరూ వేగంగా నడవసాగారు.

ఆ పిచ్చితల్లి గట్టిగా కేకలేసింది 'పాక్‌పారీ... పాక్‌పారీ'. నిజంగా ఆమె ఎంతో బాధకు గురైంది.

నేను ఆమెను అడిగాను. 'నీవు ఎవరిని చూశావ్..?'

ఆమె నెత్తి కింద రెండు జీవం లేని కళ్ళలో అమితాశ్చర్యం నాకు కనబడింది. 'నా కూతురు పాక్‌పారీ' అని అందామె.

నేను మరలా చెప్పాను. 'అమ్మా.. ఆ అమ్మాయి ఎప్పుడో చచ్చిపోయింది.'

'నీవు అబద్ధం చెబుతున్నావ్' అని ఆమె నావైపు తిరిగి అరిచింది.

'నేను చెప్పిందాన్ని నీవు తప్పకుండా వినాల్సిందే' అన్నాను నేను. 'అమ్మా, దేవుడి సాక్షిగా చెబుతున్నా. మీ అమ్మాయి ఎప్పుడో చచ్చిపోయింది.'

నా మాట విన్న మరుక్షణం ఆ వృద్ధురాలు కుప్పకూలిపోయింది. ఆమె వెదుకులాట ఒక ముగింపుకొచ్చేసింది. ఆ సర్కిల్లో ఆమె విగతజీవిగా పడిపోయింది.

■

# ఆకు కూరలమ్మి..!

- కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి
సెల్ : 9948774243

వైయాకరణుడు వింటూ
దాన్నో కేక అన్నాడు!
నాకు మాత్రం అదో బతుకు పాటగా వినిపిస్తూ...
గుండెల్లో పుట్టి
గొంతులో మెలితిరుగుతూ
శబ్దాన్ని శృతిలోకి రాల్చుకుంటూ
స్వరాన్ని 'లయ'లోకి జార్చుకుంటూ
మాటకు మాట ముడివడి మంత్రమైనట్లు
వీధిలో ప్రతి యింటిని పలుకరిస్తూ
నాలాంటి ఎందరినో సమ్మోహనపరుస్తూ
నాలుగు వీధుల నిండా అల్లుకుపోతున్న
ఆకుపచ్చని రాగమది!



తెలతెలవారకముందే
సుప్రభాతం వినిపించినట్లు వో వైతాళిక ధ్వని
గమకాలు పోతూ గమ్యాన్ని వెతుకుతూ
"ఆకు కూరలమ్మా! ఆకు కూరలోయంటూ
ఆరోగ్యాన్నిచ్చే ఆకుకూరలంటూ"
పల్లవీ అదే! చరణమూ అదే!
అంతకుమించి మరోమాటలేని పాట
ఆగి ఆగి సాగుతూ ఆకాశాన్ని తాకుతూ
బతుకు భారాన్ని మోసే పాట
సంసార శోకాన్ని వ్యక్తీకరించే పాట
ఆర్తి, ఆర్ద్రత, ఆత్మవిశ్వాసం మిళితమై
హృదయాల్ని తొణికిసలాడించే పాట!
జరజరపాకే నీటి కేకలా బుసలు కొడుతూ
ఉరుకు పరుగులతో వీధి వీధినీ చుడుతూ
జీవన పోరాటానికి
నైవేద్యమైన పాట
ఒకే ఒక్క చరణంతో
వంటిళ్ళకు చెవులు మొలిపించే పాట!
పొద్దున్నే కాఫీ కప్పులు పక్కనబెట్టి
చిల్లర డబ్బులు చేతబట్టుకొని
వంగిలేస్తూ ఒయ్యారాలు పొయ్యే
లయాన్వితమై సాగివస్తున్న ఆ పాటను
ఆలకిస్తూ... అవలోకిస్తూ
వాంఛితం ఊటలెత్తిన హృదయాలతో
ఎదురుచూసే ఇల్లాళ్ళ సందోహం

అదేమి మాయోగాని
ఆ పాటకు వీధి వీధంతా శ్రోతలై పోతూ
ఆ పాటలో దాగున్న శ్రమైక చైతన్యపు సింగారం ముందు
ఆర్థిక పొగరుకు అలంకారప్రాయమైన
సంగీత కచ్చేరీలెన్నో! తలదించుకుంటాయ్!
ఏటేటా పంట నష్టం ! బతుకు కష్టం!
విస్తరిస్తూన్న అప్పుల ఊబి!
ఏమీ పాలుపోని మొగుడు మందుబాబై
మద్యం మాఫియాకు ఆస్తులమ్మి కప్పం గడుతుంటే

జీవన రేఖపై
బతుకు తెరువు మార్గాన్వేషణే ధ్యేయంగా
అస్థికలరగదీస్తూ
తలమీద ఆకుకూరల బుట్ట
నడుముకు పైట పిడిచుట్టు చుట్టి
సంగీత సాధనలో తీరిన స్వరంలా
మనిషి వాసనేస్తూ
ఇంటింటికి వసంతాన్ని మోస్తూ
ఎంత లేదన్నా
కాయాన్ని కవ్విస్తున్న యవ్వనంతో
ఒయ్యారాలు పోతూ నడుస్తుంటే...
కామవాంఛలు వెదజల్లేందుకు
కార్పొరేట్ వ్యవస్థలు నిర్వహించే అందాల పోటీల్లో
ర్యాంప్‌పై కృత్రిమ హావభావాలు పోతూ నడిచే
నవనాగరికత సుందరీమణుల సౌందర్యం
ఆకుకూరలమ్మి అందాల ముందు
చిన్నబోతున్నట్లనిపిస్తూంటూంది!
జీవితానుభవాల్ని ఆరబోస్తూ
హృదయాలను చెమ్మగిలచేస్తూ
ఏ పొద్దూ ఆగని పాట
అలుపు సొలుపెరుగని ఆత్మవిశ్వాసానికి
ఆలంబనమైన పాట
స్వేదాంబుధి ఈదే చేపపిల్లకు
ఈత నేర్పే పాట
ఆనంద భైరవై సాగిపోతూ
ఆత్మాభిమానాన్ని నమ్ముకొని
రైతాలుని "ఆకు కూరలమ్మి"గా అవతారమెత్తించిన
విధి వైపరీత్యాన్ని ఎత్తిచూపే సేద్యగానికి చేయూతనివ్వని
ప్రభుత్వ వైఫల్యానికి ప్రతీకైన
"ఆకు కూరలమ్మి" అద్భుతమైన పాట!!

# బహుముఖ అస్తిత్వ ప్రకటన వేంపల్లె షరీఫ్ కథలు




- యం.డి. యాకూబ్ పాషా

ఎండాకాలానికి, చలికాలానికి మధ్య ఒక అర్ధరాత్రి.

పడుకునే ముందు ఒకసారి బుక్‌షెల్ఫ్ వైపు చూశాను.

నూట నాలుగు పేజీల షరీఫ్ తన కళ్ళద్దాలను సవరించుకుంటూ నవ్వుతున్నాడు. నిజానికైతే గుడ్‌నైట్ చెప్పి పడుకోవాలి. నేను అలా చేయలేదు. షరీఫ్‌ను నా దగ్గర కూర్చోమన్నట్టు సైగ చేశాను. అతను బుక్‌షెల్ఫ్‌లో నుంచి వచ్చి బుద్ధిగా కూర్చున్నాడు. ఇంచుమించు తొమ్మిది సంవత్సరాల వెనక్కి ఆ పిల్లాడిని తీసుకెళ్ళాను. పంజాగుట్ట స్మశానం దగ్గర ఉన్న ఆంధ్రజ్యోతి పాత బిల్డింగ్ దగ్గరకు తీసుకెళ్ళాను.

"ఇప్పుడు చెప్పు షరీఫ్. అప్పట్లో ఇక్కడ రాసిన కథ" అన్నాను. అతను కడప యాసలో నవ్వాడు.

"తొమ్మిది సంవత్సరాలవుతోంది. ఇంకా మరచిపోలేదా?" అన్నాడు.

"ఎలా మరిచిపోతాను. కదీర్ సాబ్ నీ కథ పట్టుకుని హైదరాబాదంతా తిరిగి అక్కడి నుంచి ఔరంగాబాద్‌కు పోయి ఆడి నుంచి బొంబై పోయి హుసేన్‌తో బొమ్మ వేయించుదామని ట్రై చేసినాడు కదా.." అన్నాను.

"ఆయన కాదు ఈయన ఏసినాడు" అని బొమ్మేసినాయన గురించి చెప్పబోయినాడు.

నేను మధ్యలోనే అడ్డుకుని "అదంతా ఇప్పుడెందుకు కానీ... నీ కథ ఉందే... అదే 'జీపొచ్చింది' గురించి చెప్పు?" అన్నాను.

అతను చెప్పడం మొదలుపెట్టాడు.

"తెలుసు కదా... ఇతనే వెంకట్రెడ్డి..." అని రైతును పరిచయం చేశాడు.

రైతు బలహీనంగా ఉన్నాడు. కన్నీళ్ళకు మానవరూపం మాదిరిగా ఉన్నాడు.

"ఏమైంది ఇతనికి...?" అని అడిగాను.

అతడు పొలం దగ్గరకు తీసుకెళ్ళి కరెంట్ బోరు వైపు చూపిస్తూ బోరు బోరున ఏడ్చాడు.

"ఇంతకీ అక్కడ బోరు ఏది?" అని అడిగితే కరెంటోళ్ళ కర్కోటకత్వాలను గురించి చెప్పాడు.

...

వెంకట్రెడ్డి పొలం వాన పడితే గానీ పచ్చగా నవ్వదు. రాయలసీమలో వానంటే మాటలా? వానను నమ్ముకుని చేసేది ఎవుసాయమేనా? అందుకే అప్పు చేసైనా తన పొలాన్ని పూలవనం చేయాలనుకుంటాడు వెంకట్రెడ్డి.

'నాకెందుకో మన పొలంలో నీళ్ళు పడ్తాయి. మన కష్టాలు తీర్తాయి అనిపిస్తోంది మావా' అని భార్య కూడా అతనికి ధైర్యం ఇచ్చింది.

'నీళ్ళు పడితే పొలం నాది. పడకపోతే అప్పిచ్చిన ఆసామిది' అనుకుంటూ భార్య ధైర్యానికి తోడు తన ధైర్యాన్ని కూడా చేర్చుకుని రంగంలోకి దిగాడు వెంకట్రెడ్డి.

అయ్యో! మూడు వందల అడుగులు దాటినా బోరు రాడ్డు చెమ్మకు తగల్లేదు!! బోరు నుంచి ఒక చుక్క కూడా నీరు రావడం లేదు. ఆలుమగల కళ్ళ నుంచి మాత్రం వద్దన్నా ఆగకుండా ప్రవహించే వేడి వేడి కన్నీటి ప్రవాహం.

ఆ ప్రవాహం మూడు వందల అడుగులు దాటిన తర్వాత ఆగింది. గంగమ్మ కన్ను... కరుణ చూపింది. తెల్లటి గంగ పరుగు పరుగునా వచ్చింది. ఆ గంగమ్మ నీడలో ఆ రైతు కుటుంబం పచ్చగా బతికిందా అంటే లేదు. ఎన్ని కష్టాలు పడుతూ బతికిందో షరీఫ్ చెప్పాడు. గుండె కన్నీటి సునామీలో కొట్టుకుపోయే వాక్యాన్ని కథ చివర్లో ఇలా చెబుతాడు... "జీపు ముందుకు కదిలింది. దుమ్ము లేపుకుంటూ వెళ్తున్న ఆ జీపు వెంకట్రెడ్డి ప్రాణాన్ని తీసుకెళ్తున్న యముని వాహనంలా ఉంది.." ఆ మాటతో మనం వెనక్కి వెళ్ళిపోతాం. మనం మన అనుభవాల్లోకి... వాటిల్లో వినిపించే ఆకలి కేకల దగ్గరికి చేరుకుంటాం.

...

కొన్ని రోజుల క్రితం నేను మా ఊరు వెళ్ళినపుడు ఫ్రెండ్‌తో అన్నాను. "మనం చిన్నప్పుడు పొలాలు... అ...క్కడి దాక ఉండేవి. ఏవిరా పొలాలు? అన్నీ ఇండ్లే కనిపిస్తున్నాయి?"

వాడు అన్నాడు. "ఇయ్యాల రేపు ఎవడయ్యా ఎవుసాయం చేసేది?"

"ఎందుకు? ఏమైంది?" - అన్న ప్రశ్నకు ఒక పంట పండటానికి ఎంత ఖర్చవుతుందో, ఎన్ని కష్టాలు ఉంటాయో పూసగుచ్చినట్టు చెప్పాడు.

తర్వాత ఇలా అడిగాడు.."ఇప్పుడు చెప్పు నీకే గనుక భూమి ఉంటే ఎవుసాయం చేస్తావా?"

నేను చేస్తానన్నానా? చేయనన్నానా? అనేది విషయం కాదు కానీ ఆర్థిక పరిపుష్టి లేని రైతు, అదృష్టం లేని రైతు - వ్యవసాయం చేయడం దండగ అనే స్నేహితుని మాటలను ఖండించడానికి మనలో ఉన్న ఎంత కరుదు కట్టిన భావుకత అయినా, వ్యవసాయ ప్రేమికత అయినా ముందుకు రాదు. వాస్తవం అలాంటిది.

***ఒకప్పటి పంట పొలాలు చూడండి... దాబాలై కనిపిస్తాయి. ఒకప్పటి పంట పొలాలను వెదకండి. నల్లని మెకానిక్ షెడ్డులై కనిపిస్తాయి. ఒకప్పటి పంట పొలాలను ఆత్మీయంగా పిలవండి... రియల్ ఎస్టేట్ నాగుపాములు వాస్తవ లోకంలోకి తీసుకువస్తాయి. భవిష్యత్‌లో వెంకట్రెడ్డి ఏమైపోతాడు? మళ్ళీ అప్పు చేస్తాడా? కరెంట్ స్తంభానికి శవమై తేలుతాడా?***

ఒకప్పటి పంట పొలాలు చూడండి... దాబాలై కనిపిస్తాయి. ఒకప్పటి పంట పొలాలను వెదకండి. నల్లని మెకానిక్ షెడ్డులై కనిపిస్తాయి. ఒకప్పటి పంట పొలాలను ఆత్మీయంగా పిలవండి... రియల్ ఎస్టేట్ నాగుపాములు వాస్తవ లోకంలోకి తీసుకువస్తాయి. భవిష్యత్‌లో వెంకట్రెడ్డి ఏమైపోతాడు? మళ్ళీ అప్పు చేస్తాడా? కరెంట్ స్తంభానికి శవమై తేలుతాడా?

పెరుగన్నంలో ఎండ్రిన్ కలుపుకుని తింటాడా? ఏమైపోతాడు వెంకట్రెడ్డి?

వెంకట్రెడ్డి ముఖం ముఖం కాదు. భారత గ్రామీణ వ్యవసాయ ముఖచిత్రం. ఒక సాయినాథ్‌లా రైతు పేద గుండెను మనకు చూపెట్టాడు షరీఫ్.

వెంకట్రెడ్డి విషాద లోకంలో కన్నీళ్ళు తుడుచుకుంటూ ఉండగానే నూకలమూటె కోసం కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని ఆశగా చూస్తున్న రజాక్‌మియా గురించి అతని సేద్యం గురించి చెప్పడం ప్రారంభించాడు షరీఫ్.

చలమాడ్డి నాలుక సాగుతుంది. సాగుతూనే వుంది. రజాక్‌మియా పొలాన్ని మింగడానికి వలపై నూకలమూటె వున్నది. వలమీదికి పోకపోతే నూకల మూటె దొరకదు. పోతే ప్రాణం తిరిగిరాదు.

"రెండు రోజులు. రెండే రెంద్రోజులు. నీ మోటారు నీళ్ళు ఇచ్చినావంటే ఇప్పుడే ఎల్లి నీ తోట్లో నుంచి కాలువ తొక్కుంట. నా సెనిక్కాయ సెట్లను బతికించుకుంటా. ఇయ్యి చేతులు కాదు రెడ్డి. కాదొనొద్దు.."

రెడ్డి అవుననలేదు... కాదనలేదు.. నాలిక మాత్రం మరింత పెద్దగా చాచాడు.

దానికి దొరక్కుండా రజాక్‌మియా పరుగెడుతూనే వున్నాడు. పరుగెడుతూనే ఉన్నాడు. ఆయాసం వస్తుంది. కాస్త ఆగాడు.

"నందిమండలం కాడ యాక్సిడెంట్ అయిందట. సాయిబులాయమ్మ ఎవరో టాక్సీ నుండి కింద పడిపోయిందట. నెత్తంతా ఒక పక్క చీలిపోయింది. చూల్లేకున్నాం సామి" ఎవరి మాటలో ప్రమాదం రొద పెడుతున్నట్టుగా రజాక్‌మియా దగ్గరికి చేరాయి.

"ఆమె ఎవరై ఉంటారు?" అనుకున్నాడు తనలో తాను.

"అమ్మ ఎక్కడ?" అని కొడుకును అడిగితే అతను... "నందిమండలానికి పనికి బోయిందబ్బా..." అంటాడు.

రజాక్‌మియాతో పాటు వింటున్న మన గుండెల్లో కూడా పెద్ద రాయి పడింది. ఏకధాటిగా రెండు కథలు చెప్పి ఊపిరి పీల్చుకోవడానికి రెండు నిమిషాలు ఆగాడు షరీఫ్.

ఆ తరువాత అతన్ని ఇలా అడిగాను. "నాకెందుకో... జీపొచ్చింది కథలో వెంకట్రెడ్డి వెంకట్రెడ్డి కాదనిపిస్తోంది. అతను కూడా మరో రజాక్‌మియే అనిపిస్తోంది."

"అవును. అతను వెంకట్రెడ్డి కాదు. రజాక్‌మియానే. కొన్ని కారణాల వలన పాత్ర మతం మార్చాల్సి వచ్చింది" అన్నాడు.

అపుడు నాకు అనిపించింది. జీపొచ్చింది. రజాక్‌మియా కథలను ఒకటి చేసి ఆ కథకు మరికొన్ని కథలు కలిపితే కృత్రిమత్వం లేని ఒక గొప్ప నవల తయారై పోతుంది.

తెలుగు సాహిత్య వాతావరణంలో అస్తిత్వ వాదాలు బలంగా ప్రతిఫలిస్తున్న ఆ కాలంలో కాస్త బలహీనంగానైనా అవి కనిపిస్తున్న నేటి కాలంలో తెలుగు ముస్లిం సమాజానికి సంబంధించిన అనేక కోణాల్లో నుంచి అనేక కథలు, చాలా తక్కువ నవలలు వచ్చాయి. నాకు తెలిసి ఈ సాహిత్యంలో రైతు జీవితం ఎక్కడా కనిపించలేదు. బహుశా రచయితల నేపథ్యం వ్యవసాయానికి దూరంగా ఉండడమే కావచ్చు.

ఇలాంటి సమయంలో శైలి పాతదే అయినా తనదైన ప్రత్యేక వస్తువుతో ముందుకు వచ్చాడు షరీఫ్.

"సాయిబులు కూడా వ్యవసాయం చేస్తారా? అని ఇప్పటికి ఆశ్చర్యపోయే సమాజంలో" అవును వాళ్ళు కూడా వ్యవసాయం చేస్తారు" అని చెప్పే కథ ఒకటి కావాలి.

ముసల్మాను రైతుల కష్టాలను కథలుగా రాసే రచయితల ఒకరు కావాలి. అని అనుకున్నప్పుడు షరీఫ్ తప్పనిసరిగా గుర్తుకు వస్తాడు.

వ్యక్తికి ఉన్నట్టు వృత్తికి కులం ఉంది. అందుకే సాయెబుల రైతు కష్టం కష్టం కాకుండా పోయింది. "వ్యవసాయం అనేది ఏ దారి లేక ఇరుక్కుపోయిన మార్గమై పోయింది."

"రజాక్ మియా సేద్యం"లో గొల్లోళ్ళ పిల్లోడు అంజిగాడు ఇలా అంటాడు... "సాయిబులు మీకెందుకు మామా వ్యవసాయం. అమ్మి పారేసి ఏ దుబాయికో... కోయిటుకో పోకుండా..."

వస్తుగతంగా చూసినప్పుడు భారతీయ రైతాంగానికి, అందులో భాగం అయిపోయిన సాయిబుకు ఏ విషయంలోనూ పెద్ద తేడా ఉన్నట్టు కనిపించదు. కానీ, సూక్ష్మదృష్టికి వెళ్ళినప్పుడు ఆశ్చర్యపడే విషయాలు బయటకు వస్తాయి. అందుకు అనుభవం కావాలి. ఆ అనుభవం రాయలసీమ రైతు బిడ్డ షరీఫ్‌లో దండిగా ఉంది.

. . .

మరుసటి రోజు సాయంత్రం నేను మా ఊరెళ్ళడానికి సికింద్రాబాద్ స్టేషన్‌లో కాకతీయలో విండో సీటు దగ్గర కూర్చున్నాను. నేను షరీఫ్ కథల నేపథ్యంలో ముస్లిం వెనుకబాటుతనానికి కారణాలను కాసేపు సచార్ కమిటీలో, మరికాసేపు అస్గర్ ఆలీ ఇంజినీర్ మాటల్లో చూడటం ప్రారంభించాను.

**రాయలసీమ జీవితం, మడికట్లలో పడి నడిచే సాయిబునే కాదు షరీఫ్ మిగతా కథలను పరిశీలిస్తే వాటిల్లో బహుముఖ అస్తిత్వ ప్రకటన ఉంది. భౌగోళిక అస్తిత్వమూ ఉంది. అందులోనే మత అస్తిత్వం వుంది. ఈ రెండిటినీ సమన్వయం చేసుకుని చిత్రం గీస్తున్న సమయంలో ఇదివరకు ఎవరూ గీయని చిత్రాలు మనకు కనిపిస్తాయి.**

"భారతీయ ముస్లిములందరూ వెనుకబడిన వారు కాదనే విషయాన్ని తెలుసుకోవాలి. ముస్లింల వెనుకబాటుతనానికి కారణం వారి సామాజిక మూలల్లోనే వుంది" అని అస్గర్ ఆలీ చెప్పారు.

మధ్యయుగాల్లోని సంపన్న ముస్లిం పాలక వర్గాల గురించి, వారి సంపద గురించి, రైతాంగం నుంచి వసూలు చేసిన వ్యవసాయ సంపద గురించి కూడా ఆయన చెప్పి ఉన్నారు.

బాగా బతికిన నవాబుగిరి సంపన్న ముస్లింలను కాసేపు మరిచిపోదాం. వెనుకబడిన ముస్లింల గురించి మాట్లాడుకుందాం. వారి మూలాల్లోకి వెళ్దాం. శూద్రకులాల నుంచి ప్రజలు ఇస్లాంలోకి చేరినందువల్లే ముస్లింల వెనుకబాటుతనానికి కారణంగా ఆయన చెప్పారు. వివిధ వృత్తుల ఆధారిత ప్రజలు ఇస్లాంలోకి వచ్చినప్పుడు మతం అయితే మారింది కానీ, వృత్తి మారలేదు. పండ్లు అమ్మేవాళ్ళు మాలీలుగా, అద్దకం పనివాళ్ళు రంగ్రేజ్‌గా, శవాలకు గోతులు తవ్వేవాళ్ళు గోర్కన్లుగా, తమలపాకులు అమ్మేవాళ్ళు తంబోలీలుగా, కమ్మరివాళ్ళు లోహార్లుగా... ఇలా రకరకాల పేర్లతో ఉన్నారు. మతం మారింది. వృత్తి మారలేదు. దాన్ని అంటిపెట్టుకుని ఉన్న పేదరికం మారలేదు.

ఈ నేపథ్యం నుంచి చూసినప్పుడు రజాక్‌మియా లాంటి సేద్యగాళ్ళు ఎక్కడి నుంచి వచ్చి ఉండొచ్చు.. వారి పేదరిక మూలాలు ఎక్కడ ఉండి ఉంటాయి?

"లేదు మేము ముమ్మాటికి ముసల్మానులమే. మా ముత్తాత ముత్తాత రోజుకు ఐదుసార్లు నమాజుకు పోయేవాడట. మా తాత కూడా అంతేనట" అనే స్వీయ నిర్ధారణతో చాలామంది సంతృప్తి పడేకంటే తమ తమ మూలాల్లోకి వెళితే సరికొత్త విషయాలు తెలిసిరావొచ్చు. తెలుగు ముస్లిం సాహిత్యంలో ఇలాంటి ప్రయత్నమేదీ ఇప్పటి వరకు జరగలేదు.

"మేము ముస్లింలం. మేము వెనుకబడిపోయాం" అనేది సామాజిక వాస్తవమే గానీ, ఆ వెనుకబడినతనానికి చారిత్రక కారణాలను వెదుక్కోవడం నామోషి అనదగిన పనికాదు. అస్గర్ ఆలీ మరో మాట కూడా ఇలా చెప్పి ఉన్నాడు.

"చాలామంది ముసల్మానులు అత్యంత పేదరికంలో కొట్టుమిట్టాడుతున్నారు. దీనికి కారణం వారి సామాజిక మూలాల్లోని స్వభావం."

ఆ స్వభావం ఏమై వుంటుంది?

రజాక్‌మియాని పది తరాల వెనక్కి తీసుకెళితే ఆ స్వానుభవంలోని సారం మనకు ఏమైనా అర్థమవుతుందా? ఈ దిశలో షరీఫ్ ఏదైనా ప్రయాణం చేస్తాడేమో చూడాలి.

రాయలసీమ జీవితం, మడికట్లలో పడి నడిచే సాయిబునే కాదు షరీఫ్ మిగతా కథలను పరిశీలిస్తే వాటిల్లో బహుముఖ అస్తిత్వ ప్రకటన ఉంది. భౌగోళిక అస్తిత్వమూ ఉంది. అందులోనే మత అస్తిత్వం వుంది. ఈ రెండిటినీ సమన్వయం చేసుకుని చిత్రం గీస్తున్న సమయంలో ఇదివరకు ఎవరూ గీయని చిత్రాలు మనకు కనిపిస్తాయి.

అరచేతులు రెండూ తెరిచాను. నాకు షరీఫ్ కథల్లోని దస్తగిరి చెట్టు కనిపించింది. నా మొక్కును ఆ చెట్టుకు పదిలంగా కట్టుకున్నాను.

షరీఫ్ ఇలా రాయాలి. పేదోడి కష్టాల గురించి, ఖాళీ అయిపోతున్న మనిషి గురించి, సామాజిక విధ్వంసాల గురించి, ఆ ధాటికి గుండె చెదిరిన అమ్మల గురించి, వారి ప్రియమైన కొడుకుల గురించి, మత వైరుధ్యాల గురించి, ఎల్లలు చెరిపేసి ఒకరి ఆత్మను మరొకరు ఆలింగనలు చేసుకునే అపురూప సాంస్కృతిక విశ్వరూపం గురించి, ఒకే మనిషిలో ఉండే అనేక చీకటి లోయల గురించి, ఆ లోయల అంచుల్లో సన్నగా పారుతున్న వెలుతురు గురించి... ఇంకా... ఇంకా... ఇలాగే... రాస్తూనే ఉండాలి. ●

# నినాదం

- సిరిసిల్లా గఫూర్ శిక్షక్
సెల్ : 9849062038



నినాదమంటే పెదవుల
పద నృత్యం కాదు
నినాదమంటే వట్టి మాటల
ఆర్తి కాదు
గుండె లోతుల్లోంచి ఉప్పొంగే
ఆవేదనల శక్తి ప్రవాహం

మనసు అంతర పొరల దారుల్లో
వేదన వాహనమై ప్రయాణించి
కష్టాల భారానికి ఉబికిన కన్నీటిని
ఇంధనంగా మార్చుకొని
జయ లక్ష్యం చేరేందుకు
సాగించే సాహస ప్రయాణం

గుండెల్లో అగ్నిపర్వతాలను పేల్చుకొని
కండ్లల్లో లావాలను విరజిమ్ముకొని
ఎత్తిన పిడికిలిని కాగడాగ మల్చుకొని
చీకట్లను చీల్చి జాగృత ఉదయాలను
పంచే సామాన్యుడి సింహగర్జన నాదం

ఉదయించిన సూర్యుడి తొలి కిరణ పిలుపూ ఓ నినాదం
పుట్టిన పసిపిల్లాడి తొలి అరుపుల పలుకు ఓ నినాదం
వాన చినుకు రాక ముందు మేఘపు ఉరుముల
మెరుపూ ఓ నినాదం
మార్పును కోరుతూ సాగే
అడుగుల్లోని ప్రతి మలుపూ ఓ నినాదం

నినాదమంటే..?
మెతుకులు అందని బతుకుల వేదం
ఆకలి సృష్టించిన ఉద్యమ నాదం
ఎండి రాలిపడినప్పుడు ఆకు చేసే శబ్దం ఓ నినాదం
కాలుతున్న వీరుని శవ అగ్ని
జ్వాలల గానం ఓ నినాదం
పుట్టినపుడె ఎదిగి నింగి అంచులనూ తాకగలదు
మది మదిలో నిలిచి నిప్పు కణికలాగ మండగలదు
ఆవేశం, ఆలోచన, ఎన్నెన్నో రూపాలు
ఏ రూపులోనైనా, అన్ని రూపాల్లోనూ
ఉద్యమమై లేవవచ్చు, ధైర్యమిచ్చి నడపగలదు
అన్యాయం, అధర్మాల
గోయి తీసి పూడ్చేందుకు
ఎక్కడైన, ఎప్పుడైన
మట్టిలోని కణ, కణం
నినాదమై లేవవచ్చు
ఆకాశానికేసిన కొండచూపు, ఓ నినాదం
వెన్నెలతో బీదవాడి చూపు భాషా ఓ నినాదం
ఎగిసెగసి పడుతున్న అల చప్పుడు ఓ నినాదం
డప్పుకు జతగా మారిన
కాలి గజ్జె చప్పుడు ఓ నినాదం
ఆకాశం ఉరిమిందా..?
మేఘ నినాదం...
సునామీ ముంచిందా..?
సముద్ర నినాదం..
భూకంపం రానుందా..?
భూమాత నినాదం
బతుకున ఉదయాలు పూచాయా..?
మనసుల చైతన్య నినాదం..
నినాదమంటే
నింగినంటేలా ఎగిసే
ఆవేదనల అలల ప్రవాహం

---

# చైతన్య గీతం

- పొత్తూరి సుబ్బారావు
సెల్ : 9490751681



సాహిత్యమనేది
తెల్లని కాగితంపై లిఖించబడే
నల్లని అక్షర సముదాయం కాదు
మనిషి మస్తిష్కంలోకి
చొచ్చుకుపోయే
మంత్రాక్షర మాల అది
మనిషి మనిషితో కలసి
మనుగడ కోసం నడిపే
మమతలబండి సమాజమయితే
దాన్ని సామరస్యపు చక్రాలతో
నడపగలిగేది సాహిత్యం
సమాజంలో దాగి వున్న మంచితనం
విచ్చుకున్న గులాబీ అయితే
అనుక్షణం దాన్ని 'ముల్లు'లా,
కాపాడుతుండేది 'సాహిత్యం'

దురాచారాలతో దుర్బుద్ధులతో
ఆ సమాజమే వెర్రితలలు వేసినప్పుడు
వాటిని అడ్డంగా నరకటానికి
వేయి కలాలను ఖడ్గాలుగా మార్చకలిగేది
సాహిత్యమేనన్నది అక్షర సత్యం
నాటి సమాజంలో నెలకొన్న
కన్యాశుల్కాన్ని నిర్జీవం కావించి
సజీవంగా నిలబడింది
గురజాడ కన్యాశుల్కం

పదము పదముతో అడుగులు వేయించి
పదండి ముందుకంటూ
పోరాట స్ఫూర్తితో ప్రజలను
దూసుకుపోయేలా చేసింది
శ్రీశ్రీ మహా ప్రస్థానం
సామాజిక పుడమిని
అడుగు అడుగునా కలంతో
సేద్యం కావింప చేసి
విప్లవ విత్తనాలు మొలకెత్తేలా
చేయగలిగేది "సాహిత్యం"
రాలిన స్వప్నాలకు కొత్త చిగుళ్ళను తొడిగి
సామాజిక స్మృతి పథంలో దాగివున్న
'మౌనగీతాన్ని' 'చైతన్య గీతం'లా
ఆలపింప చేయగలిగేది
'సమకాలీన సాహిత్యం'

**(సాహితీ స్రవంతి నిర్వహించిన
'సాహిత్యం - సమాజం' జనకవనంలో చదివిన కవిత)**

# శత వసంతాల సాహిత్య సృజన

- మేరెడ్డి యాదగిరిరెడ్డి




పోరాటాల ఖిల్లా, విప్లవాల పురిటిగడ్డ నల్లగొండ జిల్లా, ఎన్నో ఉద్యమాలకు ఆయువుపట్టు నల్లగొండ జిల్లా. సాహిత్యరంగంలో ఎన్నో ప్రయోగాలకు తెరలేచింది ఇక్కడే. తొలి కథకురాలు బండారు అచ్చమాంబ నుండి నేటివరకు నల్లగొండ కథ రాశిలోను, వాసిలోను, శిల్పంలోను, శైలిలోను, వస్తువులోను అనేకానేక మార్పులు చెందింది. భాష, యాస, మాండలికంలోను తన ప్రత్యేకతను చాటుకుంది.

కథకుడు ఎలికట్టె శంకర్‌రావు 69 కథలతో 530 పేజీలతో "నల్లగొండ కథలు" పుస్తకాన్ని తీసుకువచ్చాడు. దాదాపు రెండు సంవత్సరాలు శ్రమించి జిల్లా నలుమూలల నుండి కథలను సేకరించాడు. నూట తొమ్మిది సంవత్సరాల కథలు ఇందులో చోటు చేసుకున్నాయి. బండారు అచ్చమాంబ 'దంపతుల ప్రథమ కలహం' మొదటి కథయితే, రమేష్ హజారే 'వాన కురిసిన రాత్రి' చివరి కథ. ముఖ్యంగా ప్రతి కథకు ముందు రచయిత ఫొటో సంక్షిప్త జీవిత విశేషాలు పొందుపరచడం ఈ పుస్తకానికి వన్నె తెచ్చాయి. ఏలె లక్ష్మణ్ ముఖచిత్రం పుస్తకానికి మరింత శోభనిచ్చింది.

1967 నుండి 70 వరకు ప్రముఖ సాహితీవేత్త కాంచనపల్లి చిన వెంకట రామారావు ఆధ్వర్యంలో యువ రచయితల సమితి తరఫున సమర్పణ, మాలిక, దర్పణం మూడు కథా సంకలనాలు వచ్చాయి. వీటిల్లో జిల్లావాసులవి ముప్పయి దాకా కథలు వచ్చాయి. పరిమిత స్థాయిలో వచ్చాయి. ఇపుడు మనముందుకొచ్చిన 'నల్లగొండ కథలు' తెలుగు కథా సాహిత్యంలో నాలుగు కాలాల పాటు నిలిచే కథలివి.

ఇందులో తొలితరం, మలితరం, నేటితరం మూడు తరాల కథలున్నాయి. తొలితరం కథలు బండారు అచ్చమాంబ (దంపతుల ప్రథమ కలహం), కొమర్రాజు లక్ష్మణరావు (ఏబదివేల బేరము), షబ్నవీసు (బాలికా విలాపము), కె. రాములు (విపరీత సాహసము), బి. సీతారామారావు (గరీబోణ్ణి), హరికృష్ణారావు (పల్లెబడి) వున్నాయి.

1945 తర్వాత జిల్లాలో నైజాం వ్యతిరేక పోరాటం, గ్రంథాలయోద్యమాలు, ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు ఉద్యమాలు, తెలంగాణా సాయుధ పోరాటం, దొరలు, దేశ్‌ముఖ్‌లు, రజాకార్లపై పోరాటాలు ప్రారంభమయ్యాయి. ఆ నేపథ్యంలో వచ్చిన ఉద్యమ కథలు ఇందులో చోటు చేసుకున్నాయి. కాంచనపల్లి చిన వెంకట రామారావు (మన వూళ్ళో కూడానా), ఆవుల పిచ్చయ్య (ఊరేగింపులు), అల్వారు స్వామి (గాలిపటం), బి.ఎన్. రెడ్డి (ఆయువుపట్టు), పైడిమర్రి సుబ్బారావు (నౌకరి), ధరణికోట శ్రీనివాసులు (చల్లపులుసు), కె.ఎల్. నర్సింహారావు (శాంతి ప్రకటనలు) ఇందులో ఎక్కువభాగం ఉద్యమ కథలే కావడం విశేషం.

ఇక తర్వాత తరంలో వచ్చిన కథకులు ముదిగంటి సుజాతారెడ్డి (ముట్టడి), నిఖిలేశ్వర్ (గడ్డం మనిషి), దేవరాజు మహారాజు (సోదా), చెరబండరాజు (చిరంజీవి), యెన్నం ఉపేందర్ (మా నాయినకాని నాయిన), బోయ జంగయ్య (తుపాకులు), కాసుల ప్రతాపరెడ్డి (ఎల్లమ్మ), గుడిపాటి (గది), మేరెడ్డి యాదగిరిరెడ్డి (సెజ్), బోదనం నర్సిరెడ్డి (ఓడలు - ఓడలే), ఎన్.కె. రామారావు (విద్యుల్లత), వేణు సుంకోజు (అమ్మవాసన), ఎలికట్టె శంకర్ (తలగోరుకుండ), చిన్నయ్య (జీవచ్ఛవాలు), దొడ్డి రామ్మూర్తి (బొండిగ), జి. అనసూయ (చెదరిన బతుకులు), ఎం. వెంకట్ (వల్లెక్కం), దేవులపల్లి కృష్ణమూర్తి (మొదటి కథ), పులిపాటి గురుమూర్తి (ఐ.టి. కప్ప), కరుణ (కవులమ్మ ఆడదేనా) కథలు చోటు చేసుకున్నాయి. ఈ కథలు ఆయా కథకులకు మంచి పేరు తెచ్చాయి. వీరేగాక ఇంకా కొంతమంది రచయితల కథలు ఈ సంకలనంలో వున్నాయి.

ప్రజలెదుర్కొంటున్న ప్రజా సమస్యలు చాలామంది కథకులు తమ కథలలో వివరించారు. గ్రామీణ జీవితంలో ఒడిదుడుకులు నల్లగొండ ప్రజల జీవన పోరాటం, ఉద్యమాలు, దళితుల సమస్యలు వ్యవసాయంలో ఆటుపోట్లు, ఫ్లోరోసిస్ సమస్య, వెరసి సమకాలీన ఆర్థిక, రాజకీయ, సామాజిక మార్పులు ఈ కథలలో చోటు చేసుకున్నాయి. ప్రపంచవ్యాప్తంగా వస్తున్న అనేకానేక మార్పులు ఈ కథలలో కనబడతాయి. ఒక్కో రచయిత ఒక్కో విధంగా తమదైన శైలిలో కథలను పండించారు. ఈ 'నల్లగొండ కథలు' తెలుగు కథా ప్రపంచంలో నల్లగొండను కథల కొండగా నిలబెడతాయనడంలో అతిశయోక్తి లేదు. ఇవేగాక మిగిలిపోయిన కథలతో నల్లగొండ కథలు-2 వెలువరిస్తామని సంకలనం చివరలో సంకలనకర్త చెప్పారు. ఇది శుభపరిమాణం. ఇంత మంచి పుస్తకాన్ని అందించిన ఎలికట్టె శంకర్‌రావును అభినందిద్దాం.

సెల్ : 9949415796




# సందేశాత్మక నాటికల సంపుటి

- డా॥ పి.వి. సుబ్బారావు

సాహిత్య ప్రక్రియల్లో విలక్షణమైంది నాటకం - అత్యంత ప్రయోజనాత్మకమైన నాటక రచన ఎంతో క్లిష్టమైంది. సమాజం పట్ల అవగాహన, వ్యక్తుల మనస్తత్వ పరిశీలన, సమస్యలను నాటకీకరించగల నైపుణ్యం, పాత్ర చిత్రణా పాటవం ఉంటేనే నాటక రచయితగా రాణింపు, విమర్శకుల దృష్టిలో గుర్తింపు ఉంటాయి. "ఓ నాన్న కథ" నాటికల సంపుటి రచయిత విడదల సాంబశివరావులో ఈ లక్షణాలన్నీ పుష్కలంగా వున్నాయి. నాటక రచయితగా, నటుడిగా విశేషానుభవం ఉన్నందున ఈ నాటికల సంపుటిని గొప్పగా ప్రేక్షకుల, పాఠకుల మెప్పు పొందే విధంగా రూపొందించాడు.

ఈ నాటికల సంపుటిలో 'ఓ నాన్న కథ', 'మృగయా వినోదం', 'అవనీతలంపై అమృత కలశం', 'బాలచంద్రుడు భగ్గుమన్నాడు' అనే నాలుగు నాటికలున్నాయి. నాటికలన్నీ సందేశాత్మకాలు, సంచలనాత్మకాలు, ప్రయోగాత్మకాలు, ప్రయోజనాత్మకాలు. ఈ నాటికల్లో సమాజానికి ఆదర్శమైన మహోన్నత పాత్రలున్నాయి. ఆదర్శ ఉదాత్త స్త్రీ పాత్రలున్నాయి. ఇతివృత్తాలన్నీ వర్తమాన సామాజిక సమస్యలే.

'ఓ నాన్న కథ'లో విశ్వవిఖ్యాత చిత్రకారుడు పద్మభూషణ్ రాజేంద్రవర్మ భార్య మరణంతో అతడిలో చిత్రకారుడు నిద్రాణమయ్యాడు. చిత్రలేఖనంపై పరిశోధకురాలు చంద్రలేఖ అతడిలో చిత్రలేఖకుణ్ణి చైతన్యవంతం చేస్తుంది. వారి అనుబంధాన్ని రాజేంద్రవర్మ కొడుకులు, కోడలు అనుమానించి అవమానిస్తారు. కుటుంబ సభ్యులు ఆస్తి కోసం అనుబంధాలు, ఆత్మీయతలు మరచి విషప్రయోగంతో ఆయనను చంపే ప్రయత్నం చేస్తారు. విశ్వాసపాత్రుడైన ఇంటి సేవకుడు రంగదాసు సహకారంతో చంద్రలేఖ ఆ విషయాన్ని పసిగట్టి వారి బారి నుండి రాజేంద్రవర్మను కాపాడి ప్రశాంతమైన ఆశ్రమ వాతావరణానికి వెళ్ళడంతో నాటిక ముగుస్తుంది.

రాజేంద్రవర్మ చంద్రలేఖల అనుబంధం సాధారణ పాఠకులకు / ప్రేక్షకులకు అనైతికమనిపించవచ్చు. చంద్రలేఖ అవివాహిత - వారి అనుబంధం రాధాకృష్ణుల అనుబంధం వంటిదని రచయిత చంద్రలేఖ పాత్ర ద్వారా చెప్పించడం ఔచిత్యంగా ఉంది. ఇది అమలిన ప్రణయారాధన. ఆత్మీయ కళారాధన. ఆస్తి కోసం ఆత్మీయతలు మరిచి రాజేంద్రవర్మపై కుటుంబ సభ్యులు విషప్రయోగంతో హత్యా ప్రయత్నం చేయిస్తాడు. వర్తమాన సమాజంలో ప్రపంచీకరణ ప్రభావంతో జరుగుతున్న యధార్థ సంఘటనను రచయిత గొప్పగా నాటకీకరించాడు.

'మృగయా వినోదం' నాటికలో ఉత్తమ సంస్కారం, సేవా దృక్పథం ఉన్న డాక్టర్ మాధవీలత సమాజంలో గౌరవం కోసం, కుటుంబ ప్రతిష్ఠ కోసం శాడిస్ట్ భర్త పైశాచిక హింసలను ఆమె సహించి, భరించి చివరకు పరపురుషుడితో పరమనీచంగా ఆమెను తార్చే ప్రయత్నాన్ని సహించలేక అతణ్ణి హత్య చేస్తుంది. ఆ హత్య చట్టం దృష్టిలో నేరం కావచ్చు. నైతిక విలువలు, మానవ దృష్టితో వివేచనతో ఆలోచిస్తే శాడిస్ట్ భర్తను ఆమె శిక్షించడం సమంజసం అనిపిస్తుంది. నాటికలో పాత్రలన్నీ ఫ్లాట్ క్యారెక్టర్స్. అయినా మాధవీలత భర్త మనోహర్ వింత ప్రవృత్తి ఉన్న రౌండ్ క్యారెక్టర్. స్త్రీ వాద సాహిత్య విమర్శ దృష్టితో డాక్టర్ మాధవీలత పాత్రలో అతి సంయమనం, భర్త శాడిస్ట్ చర్యలు భరించే సహిష్ణుత ఆమోద యోగ్యాలు అనిపించవు. కానీ రచయిత ఈ నాటికను మూడు దశాబ్దాల క్రితం స్త్రీ వాద సాహిత్యం ఉద్యమంగా అంతగా ప్రచారంలోకి రాని స్థితిలో రాసినందున అప్పటి సామాజిక నేపథ్యంలో ఆమె పాత్ర చిత్రణ సమర్థనీయమనిపిస్తుంది.

# గోడ

- జుగాష్విలి

సెల్ : 9848266384

నా గోడలకు పగుళ్ళు లేవు
అవి ప్రేమ పునాది మీద లేసినవి
అవెప్పుడూ వెలిసిపోవు
భిన్నత్వాన్ని కోరే నేను
ఎప్పటికప్పుడు ఆ గోడలకు
కొత్త కొత్త రంగులు వేస్తుంటాను
ఆ గోడలెప్పుడూ ఇంద్రధనస్సులే



ఉభయ సంధ్యల
నీటి జాడల వెలుగు నీడలు
ఏ చిత్రకారుని కలల సాకారమో
నా గోడల మీద స్పర్శకందని ఆ ఆనవాళ్ళు
వసంత కాలంలో ప్రకృతిలా పచ్చపచ్చగా
పుష్ప పరిమళాలతో అలరారు ఆ గోడలు
గోడ అది ఏ గోడయినా కావొచ్చు
గోడ అంటేనే అడ్డుకు పునాది
గోడలు లేని ఆకుపచ్చని విశాలత్వమే
ఇవ్వాళ్టి నా ఆకాంక్ష

---

# దినదినగండం

- మంత్రి లక్ష్మీనారాయణ

సెల్ : 9848676264



నవ్వుతూ బతకాలిరా!
అంటారు కానీ..
నా బతుకు నిరంతరం
తిరుగుతున్న చక్రం
బరువు దెబ్బలు తగులుతున్నా
కాలం గురిపెట్టిన
గడియారం గంటలు మాత్రం
దాటుతూ వస్తున్నాను
రాత్ పైలి! దివస్ పైలి!!
(నైట్ డ్యూటీ! డే డ్యూటీ!!)

నవ్వుతూ బతకాలిరా
అంటారు కానీ..
పూటలు యుగాలుగా దాటవేస్తూ
శరీరాల్ని కందెన చేస్తూ
ఆకలి రాజ్యంలో అలుపెరుగని పోరాటం

ఆకలి బాటల్లో గమ్యం తెలియని పయనం
రాలుతున్న చెమట ధారలు
యుగాలైనా ఆగనే లేదు
నవ్వుతూ బతకాలిరా!
అంటారు కానీ...ఊహలో వున్న వెలుగు
దూరమవుతూనే వుంటుంది
చీకటి అఖాతంలో బ్రతుకులు
గాయాల మంటలతో కన్నీటి వరదలతో
సమస్యలు బహురూపులై
ఉరిత్రాడు పేనుతూ వుంటాయి

---

'అవనీతలంపై అమృత కలశం' ప్రయోగాత్మక నాటిక. ఈ నాటిక ఉదాత్త సేవాదృష్టి. ఉన్నత ఆశయాలున్న కోటీశ్వరుడు రాఘవేంద్రప్రసాద్ సమాజంలో దీనులు, బాధా సర్పద్రష్టుల ఆవేదనలను మారువేషంలో వెళ్ళి పరిశీలించి చలించిపోయాడు. వాళ్ళ కోసం పదివేల కోట్లతో ఛారిటబుల్ ట్రస్టును ఏర్పాటు చేసి దాని నిర్వహణను సేవాసక్తి అంకిత భావం ఉన్న డా॥ రాధాదేవిని తన కోడలుగా చేసుకుని అనాధ శరణాలయాలు, వృద్ధాశ్రమాలు మొదలగు సేవాసంస్థలను గొప్పగా నిర్వహించేట్లు చేస్తాడు. ఆమె సేవలకు ప్రభుత్వం నుండి "కరుణామయి" పురస్కారం అందుకుంటుంది. డా॥ రాధాదేవి తన భర్త వలన శీలం కోల్పోయిన అభాగ్యురాలికి న్యాయం చేసేందుకు తన భర్తను ఆమె భర్తగా చేసిన త్యాగశీలి, రాఘవేంద్రప్రసాద్, డా॥ రాధాదేవి, డా॥ రజనీకాంత్ వంటి ఉదాత్త పాత్రలున్న ఈ నాటికలో రాధాదేవి భర్త కృష్ణప్రసాద్ స్వార్థం, అవకాశవాదం ఉన్న దుష్ట పాత్ర.

'బాలచంద్రుడు భగ్గుమన్నాడు' నాటికలో వెట్టి చాకిరీ, బాల కార్మిక వ్యవస్థలపై తిరుగుబాటు ఇతివృత్తం. ఈ నాటికలో గోపాల్, ముఖ్యమంత్రి, కలెక్టర్ వంటి ఉదాత్తమైన పాత్రలున్నాయి. జగపతిరాయుడు, ప్రభాకరరాయుడు వంటి అవకాశవాద దుష్టపాత్రలున్నాయి. బాలకార్మికుడుగా ఎన్నో బాధలు పడ్డ రాజబాబు తిరుగుబాటు తత్వంతో గోపాల్ మంచితనంతో బాలకార్మిక వ్యవస్థకు భరత వాక్యం పలకడంతో ఈ నాటిక ముగుస్తుంది. రాజబాబు పాత్ర బాల కార్మికులకు సందేశాత్మక పాత్ర.

ఈ సంపుటిలో నాటికలన్నీ సందేశాత్మకాలు. నాటిక శీర్షికలన్నీ ఔచిత్యాలు. డైలాగ్‌లు డైనమైట్లల్లా పేలి ప్రేక్షకులు, పాఠకుల హృదయాల్లో పేలి రంగస్థల ప్రాంగణంలో చప్పట్లు మార్మోగుతాయనడం నిస్సందేహం. ఈ నాటికలన్నీ రంగస్థలంపై రక్తి కట్టే నాటికీకరణాలే కాకుండా పాఠకుల చేత చదివించే లక్షణాలతో ఉభయ ప్రయోజనాత్మకంగా దృశ్య, శ్రావ్య, కావ్య లక్షణ విలసితంగా తీర్చిదిద్దినందుకు రచయితకు అభినందనలు. నాటక ప్రియులు విధిగా చదవదగిన సంపుటి.

సెల్ : 98491 77594

# కొత్త పుస్తకాలు




**బర్త్ విత్‌ఔట్ బర్త్‌డే**

**- కంచ ఐలయ్య**

**వెల : రూ.170/- పేజీలు : 244**

**ప్రతులకు : 99088 94355**

ఈ పుస్తకంలో ఉత్పత్తి కులాల విద్యార్థులకు మాతృభాష పేరుతో ఇంగ్లీష్ విద్యను దూరం చేస్తున్న అగ్ర కుల మనువాదుల చెంప చెళ్ళుమనిపించారు. తెలంగాణ ఉద్యమంలో చావులు దళిత బహుజనులకు, రాజకీయ ఆధిపత్యం మాత్రం అగ్రకులాలకేనా అని ప్రశ్నిస్తున్నారు. శూద్ర, అతి శూద్రులుగా పుట్టిన వారికి డేటాఫ్ బర్త్‌లు బడిపంతులే నిర్ణయిస్తాడని చెప్తున్నాడు. మనువాదులపై నిరంతర యుద్ధం లేకుండా అట్టడుగు కులాలకు విముక్తి లేదని, ఆ స్పృహతో సమకాలీన సామాజిక, రాజకీయార్థిక, సాంస్కృతిక పోరాటాలుండాలని అంటున్నారు.

**- ప్రచురణకర్త**




**సాహితీ విరూపాక్షుడు**

**విద్వాన్ విశ్వం**

**- సంపాదకులు**

**డా॥ నాగసూరి వేణుగోపాల్, కోడీహళ్లి మురళీమోహన్**

**వెల : రూ.200/- పేజీలు : 263**

**ప్రతులకు : 9701371256**

విద్వాన్ విశ్వంగారి విరాట్ స్వరూపాన్ని పూర్తిగా ఆవిష్కరించ లేకపోయినా కొంతలో కొంత వారి జీవన రచనా రీతులను ఈ పుస్తకం తెలియజేస్తుంది. ఈ పుస్తకాన్ని నాలుగు అధ్యాయాలుగా విభజించాం. విశ్వంగారు తమ హృదయాన్ని తామే ఆవిష్కరించే సందర్భంలో చెప్పుకొన్న మాటలనే ఈ అధ్యాయాలకు శీర్షికలుగా నిర్ణయించాం.

**- డా॥ నాగసూరి వేణుగోపాల్, కోడిహళ్లి మురళీమోహన్**




**మహోదయం**

**- కె.వి.ఆర్.**

**వెల : రూ.200/- పేజీలు : 440**

**ప్రతులకు : 98490 83137**

కవుల జీవిత చరిత్రలు, రాజకీయ, సాహిత్య వ్యాసాలు, కవిత్వం, నాటికలు, నాటకాలు, చరిత్ర వ్యాసాలు, డైరీలు, లేఖలు - ఇలా అనేక ప్రక్రియల్లో సాగిన కె.వి.ఆర్. రచనా వ్యాసంగం ఆయన విశ్వరూపాన్ని తెలియజేస్తుంది. అవసరాన్నీ, సందర్భాన్నీ దృష్టిలో పెట్టుకుని సంవత్సరానికి ఒకటి రెండు పుస్తకాలు తీసుకురావాలనీ మా ఆలోచన. గురజాడ పుట్టి 150 ఏళ్ళయిన సందర్భంగా గురజాడ జీవిత సాహిత్యాలపై కె.వి.ఆర్. రాసిన 'మహోదయం' మొదటగా తీసుకొస్తున్నాం.

**- ప్రచురణకర్త**




**జిగిరి** (నవల)

**- పెద్దింటి అశోక్ కుమార్**

**వెల : రూ.75/- పేజీలు : 136**

**ప్రతులకు : 9441672428**

మృగ లక్షణాలున్న మనిషికి, సాధు లక్షణాలు ఉన్న మృగానికి మధ్య స్నేహాన్ని, సంఘర్షణను హృద్యంగా చిత్రించిన నవల 'జిగిరి'. ఇది ఇప్పటి వరకు హిందీ, ఆంగ్లము, పంజాబీ, మరాఠి, ఒరియా, కన్నడ, బెంగాలీ భాషల్లోకి అనువాదమైంది. ఆయా భాషల పాఠకుల ఆదరణ పొందిన ఈ నవల తెలుగులో తొలిసారి పుస్తక రూపంలో వెలువడింది.

**- ప్రచురణకర్త**




**అక్షర ప్రమిదలు** (నానీలు)

**- పసుమర్తి లలిత**

**వెల : రూ.30/- పేజీలు : 34**

**ప్రతులకు : 040-23811604**

లలితగారు 'శ్వేత రాగాలు' కవితా సంపుటిలో తానేమిటో నిరూపించు కున్నారు. సరళ సుందరమూ, సామాజిక భావ బంధురమూ అయిన చక్కటి కవితలు రచించారు. ఇప్పుడు 'అక్షర ప్రమిదలు' నానీల సంపుటిలో కూడా వారి పెరిగిన పరిణతిని వ్యక్తపరుస్తున్నారు.

**- డా॥ ఎన్. గోపి**




**"తెలుగు కథ - దళిత, మైనారిటీ, గిరిజన, బహుజన జీవితం** (వ్యాస సంకలనం)

**- డా॥ వి.ఆర్. రాసాని**

**వెల : రూ.70/- పేజీలు : 180**

**ప్రతులకు : 9848443610**

"తెలుగు కథ - దళిత, మైనారిటీ, గిరిజన, బహుజన జీవితం" అన్న జాతీయ సదస్సును 16, 17, జులై 2011న, తిరుపతిలోని ఎస్వీ ఆర్ట్స్ కళాశాలలో నిర్వహించడం జరిగింది. దీనికి ప్రతిష్ఠాకరమైన యు.జి.సి.వారు ఆర్థిక సాయాన్ని అందించారు. టి.టి.డి. విద్యాసంస్థల్లోనే అరుదుగా జరిగిన ఈ జాతీయ సదస్సులో ప్రముఖ విమర్శకులు, కవి ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డిగారు కీలకోపన్యాసం చేయగా, దాదాపు 42 మంది తమ పత్రాలను సమర్పించారు.

**- డా॥ వి.ఆర్. రాసాని**

# కొత్త పుస్తకాలు




## విన్యాసం (కవిత్వం)

- కెంగార మోహన్

వెల : రూ. 80/- పేజీలు : 117

**ప్రతులకు : 9493375447**

**(040-27608107 - ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

శూన్యంగా మారిందన్న ప్రగతిశీల సాహిత్య రంగం ప్రపంచీకరణ వ్యతిరేక ఎజెండాతో ప్రతిధ్వనించింది. కొత్త చైతన్యం సంతరించుకుంది. ఈ పరిణామాన్ని సాకారం చేయడంలో సాహితీ స్రవంతి సముచితమైన పాత్ర నిర్వహించింది. రాష్ట్రమంతటా సాహిత్యశాలలు జన కవనాలతో కొత్త గొంతులకు వేదికలు కల్పించింది. అలాంటి కృషిలో మొదటి నుంచి ముందున్నవాడు మోహన్.

**- తెలకపల్లి రవి**




## వేమన్న వెలుగులు

- డా॥ ఎన్. గోపి

వెల : రూ. 250/- పేజీలు : 500

**ప్రతులకు : 040-27037585**

ఈ గ్రంథంలో 428 పద్యాలకు వ్యాఖ్యానం రాశాను. ఇవి జాగ్రత్తగా ఎంపిక చేసిన పద్యాలు. వేమన్న మూడువేల పద్యాలలోని ముఖ్యమైన భావాలన్నింటికీ ప్రాతినిధ్యం వహించే పద్యాలు వీటిలో ఉన్నాయి. ఆ రకంగా వేమన్న భావజాల సమగ్రతను దృష్టిలో పెట్టుకున్న సంకలనమిది.

**- డా॥ ఎన్. గోపి**




## జ్వాలాపాతం (కవిత్వం)

- శశికాంత్ శాతకర్ణి

వెల : రూ. 100/- పేజీలు : 93

**ప్రతులకు : 9885389759**

పడుతూ లేస్తూ
ఏకాక్షరిగా -
మాట మొదలవుతుంది -

ప్రతి మాటకు కొత్త అర్థాలు వెతుకుతూనే కవి రాయగా - కవి బతికుండాలి. చుట్టూ లోకానికి తనకూ ఉన్న సంబంధం సజీవంగా ఉండటానికి తాను బతికుండటం ముఖ్యం. శశికాంత్ ఈ రెండు దశాబ్దాలు బతికే వున్నాడని చెప్పడానికి దాఖలా ఈ కవితా సంపుటి.

**- శివారెడ్డి**




## అంతరించిన ఆదర్శాలు

(కథల సంపుటి)

- రేగులపాటి విజయలక్ష్మి

వెల : రూ. 75/- పేజీలు : 76

**ప్రతులకు : 7396036922**

క్షణికావేశం ద్వారా కలిగే నష్టాలు, ఉపద్రవాలు, అమెరికా అనుబంధాలు సంక్రాంతి పండుగ సాంప్రదాయాలు, సంస్కృతుల వద్ద ఆయా కుటుంబాల మధ్య అన్యోన్యత వృద్ధి చెందడం ఉమ్మడి కుటుంబంలోని సమస్యలు, బాధలు ఇలా కుటుంబాల్లోని ఎన్నో సమస్యలను కథలుగా మలచి తద్వారా రచయిత్రి సమాజానికి హితబోధ చేశారు. విజయలక్ష్మిగారు ఎక్కువగా కుటుంబ సమస్యలనే ఇతివృత్తాలుగా ఎన్నుకుంది. ఆవిడ కథలను అస్పష్టంగా పాఠకుల ఊహకు వదిలివేయకుండా పరిష్కారాలు చూపించింది.

**- పంజాల జగన్నాథం**




## మా వూరి కతలు (కథల సంపుటి)

- డా॥ వి.ఆర్. రాసాని

వెల : రూ. 60/- పేజీలు : 119

**ప్రతులకు : 098484 43610**

కతలన్నీ చదివి కిందపెట్టేటప్పటికి - మావూరి కతల్లోని పరిసరాల్లోకి ఇంకి, కథా సందర్భాల్లో తేలి, పాత్ర జీవ(న) స్పందనలుగా తర్జుమా కాబడిన పాఠకుడు, తన పరిమిత వ్యక్తిత్వం కోల్పోయి మొత్తం కురవపల్లెగా పరివ్యాప్తమవుతాడు. ఒక జీవితంలో అనేక జీవితాలు జీవించాలనే తృష్ణ పాఠకులకు ఉంటే, ఆ తృష్ణను ఈ కతలు తీరుస్తాయి.

**- బండి నారాయణస్వామి**




## బొమ్మ - బొరుసు (వ్యంజకాలు)

- కేతవరపు రాజ్యశ్రీ

వెల : రూ. 50/- పేజీలు : 36

**ప్రతులకు : 8500121990**

మొదటి రెండు పంక్తులూ సహజ ప్రకృతిని చెబితే, తదనంతర రెండు పంక్తులు వికృతి స్వభావాన్ని కూడా ముందుంచుతూ మొత్తం మీద మొత్తం నాలుగు పాదాలూ కలిసి బొమ్మ - బొరుసూ కలిసిన నాణెంలా ఒక సమష్టి విలువను సంతరించుకోవాలన్నది సంకల్పం! రెండంచుల నాణేల మూట ఈ వ్యంజకాలన్న మాట!

**- సుధామ**

# రెక్కలు

సిహెచ్.వి. బృందావనరావు
సెల్ : 9164427798



కరచాలనం
స్నేహం
కౌగిలింతంటే
మోహం -

స్పర్శ
ఆత్మీయం

స్వాంతన మాటలు
పలకడమంటే
మనసును
స్పర్శించడమే! -

పరామర్శ
ఓ స్పర్శ!

ప్రేమ వీక్షణం
కనులతో స్పర్శ
వలపు ముచ్చట
శ్రమా స్పర్శ -

స్పర్శ
ఓ నక్షత్ర కాంతి

నా ఉత్తరం
కోటి దిగుళ్ళు
నీ ఉత్తరం
గుండె పగుళ్ళు -

ఉత్తరం
ఓ కూల్తున్న వంతెన

మానవత్వం
లేని మనసు
మార్చురీ కన్న
ఏం నయం -

అనుకంప
అసలు సంతకం

నాలుగు
చినుకుల కోసం
నెర్రెలౌతుంది
నేల! -

నిరీక్షణం
విలక్షణం

గెలుపు ధ్యేయమే గాని
గమ్యం కారాదు
గెలుపుతో ఆగితే
ప్రగతి ఉండదు -

నిత్యచలనం
చైతన్య లక్షణం

గ్రహణం
ఉన్నపుడు
విడుపూ
ఉంటుంది -

ఆశను
వీడకు

---

# అవినీతికి ఆఖరి గడియలు ఎప్పుడో?

- వల్లభాపురం జనార్ధన
సెల్ : 9440163687



ఓడికలు, వాగులు ఒకటయ్యాయి
నది పారటం మొదలైంది
దాహం తీర్చడమే వాయిదా పడింది
చినుకు ఉనికి కనుమరుగైంది

నది పారటం మొదలైంది
గరిక పోచలకు ఊపిరి సలపటం లేదు
చినుకు ఉనికి కనుమరుగైంది
లవణీయత పోగుపడింది

గరిక పోచలకు ఊపిరి సలపటం లేదు
శ్రమ సౌందర్యం ఖజానాగా మారింది
లవణీయత పోగుపడింది
రూపాయి వినియోగ రూపం కోల్పోయింది

శ్రమ సౌందర్యం ఖజానాగా మారింది
సంక్షేమం వలస పోయింది
రూపాయి వినియోగ రూపం కోల్పోయింది
ధనం నల్ల గుప్తనిధిగా పెరిగింది

సంక్షేమం వలస పోయింది
పాత్రలు సంభాషణ మొదలుపెట్టాయి
ధనం నల్లగుప్తనిధిగా పెరిగింది
అవయవాలు ఒక్కటొక్కటిగా ఊడిపోతున్నాయి

పాత్రలు సంభాషణ మొదలుపెట్టాయి
చేయూత ఎగశ్వాసవుతోంది
అవయవాలు ఒక్కటొక్కటిగా ఊడిపోతున్నాయి
అవినీతి సింహాసనమైంది

చేయూత ఎగశ్వాసవుతోంది
బందిఖానాలు ఎసి గదులవుతున్నాయి
అవినీతి సింహాసనమైంది
అన్యాయం నల్లకోటును
రక్షా కవచంగా ధరించింది

బందిఖానాలు ఎసి గదులవుతున్నాయి
చైతన్యం చెర్నాకోల ఝళిపిస్తోంది
అన్యాయం నల్లకోటును
రక్షా కవచంగా ధరించింది
న్యాయం అజ్ఞాతవాసం వీడటం లేదు

చైతన్యం చెర్నాకోలు ఝళిపిస్తోంది
ప్రేరణ పిడుగులు కురుస్తోంది
న్యాయం అజ్ఞాతవాసం వీడటం లేదు
అవినీతికి ఆఖరి ఘడియలు ఎప్పుడో?

**(పాంటమ్ కవిత)**

# 'కాలుష్యం'పై జనకవనం



'కాలుష్యం'పై చదివిన కవితలను సమీక్షిస్తున్న డా॥ రామసూరి, ప్రక్కన చిత్రంలో హాజరైన కవులు, సాహిత్యాభిమానులు

మే 19న విజయనగరం సాహితీ స్రవంతి తన26వ 'మెరుగు' కార్యక్రమాన్ని 'కాలుష్యం' అంశంతో గురజాడ వారి గృహంలో నిర్వహించింది. సాహితీ స్రవంతి కార్యకర్తలు కృష్ణారావు సభా ప్రారంభంతో పి.ఎస్. శ్రీనివాస్ అధ్యక్షతన కార్యక్రమం నిర్వహించబడింది. కార్యక్రమంలో ముఖ్య అతిథి అయిన డా॥ రామసూరి పుచ్చలపల్లి సుందరయ్య శతజయంతి సందర్భంగా ఆయనపై స్ఫూర్తిదాయకమైన ప్రసంగం చేశారు. ఐద్వా రమణమ్మ పుచ్చలపల్లిపై ఓ గీతం పాడారు. చివరిగా ఇనుగంటి జానకి హిందీ పాట పర్యావరణంపై సుమధురంగా ఆలపించి ఆశాభోంస్లేని తలపించారు.

కవితల పఠనానంతరం కవితలపై డా॥ రామసూరి సమీక్ష చేశారు. "అమ్మాయి పెళ్ళి"ని పర్యావరణ కాలుష్య రహిత లోకకల్యాణంగా కవి పేర్కొనడాన్ని ప్రస్తుతిస్తూ అంతర్లీనంగా వున్న ధ్వని అభివ్యక్తీకరణ బాగుందన్నారు. విజయాదిత్య - మన(ః) కాలుష్యం- పద్యాల్లో ఉన్నప్పటికీ - కార్పొరేట్ మాయాజాలంలో మనల్ని మనం మోసం చేసుకొని ఎలాంటి కంచుమోతలు మోగిస్తున్నామో, భూదేవి కథల్ని, వ్యథల్ని కంచికి పంపించి మన నాశనం తెచ్చుకుంటున్నామో పేర్కొన్న కవి వ్యంగ్యోక్తి ప్రశంసనీయమని, 'నిశ్శబ్ద విప్లవం'లో 'బాంబుకాయలు రాలుస్తూనే వున్నాం అభివృద్ధి మంత్రంతో' అనే పదప్రయోగం బాగుందనీ, ఎవరు ఎలాపోతే నాకేం - అనే మానసిక కాలుష్యం నుండి బయటపడి నివారణా పద్ధతులు ఎవరికి వారే పాటించేట్లు నిశ్శబ్ద విప్లవం రావాలని కవి ఆకాంక్షించడం ఆయన నిబద్ధతని సూచిస్తోందనీ, 'కాలుష్యం'లో కవయిత్రి జానకి వాడిన 'శ్రమపడండి - క్రమపడండి' అనడంలో 'క్రమ' అనేదానికి ఒక పద్ధతి నేర్పాటు చేసుకోవాలని వాడిన ప్రయోగం ఆరుద్ర ఛెరిషించు, పెరిషించు అనే స్వతంత్ర పదప్రయోగాలను గుర్తుకు తెస్తోందనీ రమేష్ 'కాలుష్యం' కవితలో వాహనాలు వదులు పొగలు - నేలపై మబ్బులున్న భ్రాంతి కలిగించుచుండె అనే వాక్యం కాలుష్యం నిజమైన ప్రభావం పటం చూపుతోందనీ, 'ఇప్పటికైనా!!' కవితలో మద్దిల శ్రీనివాసరావు 'పర్యావరణంపై మనం చేస్తున్న వినాశకర విన్యాసం కాలుష్యం' అనడంలో విన్యాసం అనేది సాధారణంగా ఒక మంచి ఆట అనే అర్థంలో వాడతాం. కాని కవి విరోధాభాషలో వినాశకర విన్యాసం అనడం ద్వారా మంచి అనుకుంటూ చెడును కొనితెచ్చుకుంటున్న తీరును పేర్కొనడం జరిగిందనీ, చివరిలో 'మన ఉనికి శిలాజమవుతుంది' వాక్యంలో కవి బాధ యొక్క గాఢత కనిపిస్తోందనీ 'ఆకుపచ్చని జ్ఞాపకం'లో మానాపురం 'కాలుష్యం జరుపుతున్న విధ్వంసంలో పచ్చదనానికి దూరమై కలుషితమవుతున్న భవిష్యత్తు దర్శనం, మొయిద శ్రీనివాస్ 'చెమటపూలు'లో కవిత చక్కగా సాక్షాత్కరించిందనీ 'సాయంకాలానికి చిల్లర వర్షం కురిసి చీకటి మోహంలో చంద్రవంక తళుక్కున మెరిసింది' లాంటి అభివ్యక్తీకరణ కవిత్వాన్ని పటం కట్టి చూపుతుందనీ, ఇల్ల ప్రసన్నలక్ష్మి 'నాలోని నేను'లో 'చంద్రనిప్పుల్ని చెరుగుతూ దివిటీగా నిలిచేది నేనే' వాక్యంలో 'నిజవే నిప్పుల్ని కక్కి, కక్కీ చివరికి తగ్గిపోతూ, ఆరిపోతూ దివిటీ కాంతి విహీనమై పోతుంది' అంటూ వాడిన పద ప్రయోగం మెచ్చుకున్నారు. అలాగే 'పంచభూతాలనూ పంచభక్ష్య పరమాన్నాలుగా బుక్కేస్తూ' అనడం కూడా బాగుంది అన్నారు. రెడ్డి శంకర్రావు - యుద్ధం ప్రకటించాల్సిందేలో చెట్టుని గరళకంఠునితో పోల్చడం, 'ఓజోన్ పొర చిరిగి చిరిగి పరిమికంప తగిలిన గుడ్డలా వుంది' అనే వాక్యంలో పరిమికంప లాంటి పదాలు పల్లె వాతావరణం నుంచి వచ్చిన కవులకే సాధ్యం అవుతుందనీ ఎంత పల్లెతనాన్నీ, శ్రామిక జీవనాన్నీ తెలుసుకోగలిగితే అభివ్యక్తీకరణ అంత గాఢంగా, హృద్యంగా వుంటుందనీ మిగతా కవుల కవితల్ని రేఖామాత్రంగా స్పృశిస్తూ ఎక్కువ పఠనీయత వుంటే మరింత రాయగలరని ప్రోత్సాహపూర్వకంగా సూచించారు. చిరంజీవి రాజశేఖర్ కవితని మెచ్చుకుంటూ ఆశీర్వదించారు. కృష్ణారావు వందన సమర్పణతో సభ ముగిసింది. ఈ కార్యక్రమంలో సాహితీవేత్తలు, సాహితీ విమర్శకులు, సాహిత్యాభిమానులు తదితరులు పాల్గొన్నారు.

కన్వీనరు దివాకర్ ముక్తాయింపుగా ఆధునిక దేశాలు పారిశ్రామికీకరణ ద్వారా విడిచిన వాయువులు ఈనాటి ధరణీ తలానికి పెనుముప్పు కలుగజేస్తోందనీ అమెరికా పౌరుడి సగటు ఇంధన వినియోగ స్థాయి, కాలుష్య విడుదల వాటా ఇతర అభివృద్ధి చెందిన దేశాల సగటుతో పోలిస్తే చాలా ఎక్కువ స్థాయిలో వుందనీ ఈ భయంకరమైన దుస్థితిని వాస్తవాలు తెలియపరుస్తూనే కవులు కవిత్వ రూపంలో సమాజాన్ని ఎప్పటికప్పుడు ఉత్తేజపరుస్తుండాలని, సాహితీ స్రవంతి ఆ దిశలో తన వంతు కర్తవ్యాన్ని నెరవేరుస్తోందని పేర్కొన్నారు.

# కాలం కడదాకా చూపు నిలిపిన కవి కథకుడు

శ్రీరంగం నారాయణ (బాబు కథలు - నాటికలు - వ్యాసాలు) పుస్తకావిష్కరణ ఏప్రిల్ 22న సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో గురజాడ కేంద్ర గ్రంథాలయం, విజయనగరంలో జరిగింది. సంపాదకులుగా డా॥ యు.ఎ. నర్సింహమూర్తి ఆవిష్కర్తగా గొల్లపూడి మారుతీరావు ముఖ్యవక్తగా చాగంటి తులసి, ప్రచురణకర్తగా ఎన్.కె. బాబు, నిర్వాహకులుగా చీకటి దివాకర్ వ్యవహరించారు. చీకటి దివాకర్ మాట్లాడుతూ "నడవండి... నడవండి... నా మించి నడవంటి" లాంటి ప్రగతిశీల కవిత్వం రాసిన నారాయణబాబు అనగానే రోణంకి, శ్రీశ్రీ, చాసోలాంటి వారు గుర్తుకొస్తున్నారు. వాళ్ళు పంచిన బాటను యువతరం పట్టాల్సిన అవసరం, అనివార్యత ఉందని ఉద్బోధ చేశారు. రుధిరజ్యోతి, కపాలమోక్షం వంటి రచనలను గుర్తుచేశారు. వారి సాహిత్య సేవలను కొనియాడారు.



'శ్రీరంగం నారాయణబాబు' పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న గొల్లపూడి మారుతీరావు

డా॥ యు.ఎ. నర్సింహమూర్తి మాట్లాడుతూ 1970లో ఆరుద్ర, నారాయణబాబు రుధిరజ్యోతి అనే కవితా సంపుటిని ముద్రించి వారి విధేయతను చాటుకొన్నారన్నారు. నారాయణబాబు సాహిత్యం, సంగీతం రెండూ తెలిసిన కవియని, వారి రచనలను తెలియజేశారు. చాగంటి తులసి మాట్లాడుతూ నారాయణబాబు అక్షరజ్ఞుడు, పదాల శక్తిని అందుకోగల్గిన వాడు కావున అత్యాధునికుడు అంటూ నారాయణబాబు కవితా గేయాలు నడవండి... నడవండి.. ఎండాకాలం... పగుళ్ళు, నెగుళ్ళు... వీటిని కవాతు గీతాలుగా పాడుకొనేవాళ్ళమని... ఆయనతో తనకు గల అనుభవాలను చెప్పుకొచ్చారు. ముఖ్య అతిథి గొల్లపూడి మారుతీరావు... నారాయణబాబు ఎలా రాసినా, దాన్ని ఫోకస్ చేయగలిగినా కవి. ఈ జాతి నష్టపోయిన కవి నారాయణబాబేయని పేర్కొన్నారు. తనకు నారాయణబాబు పుస్తకావిష్కరణ ఎంతో సంతృప్తి నిచ్చిందని పేర్కొన్నారు. నారాయణబాబు తక్కువ రచనలే చేసినా అవి విశిష్టమైనవని, ఆయన మరికొన్నాళ్ళు ఉన్నట్లయితే ఇంకా ఉత్తమోత్తమమైన సాహిత్యాన్ని ప్రపంచానికి అందించేవారని అన్నారు. తాను ఈ ప్రాంత సాహిత్యాన్ని నిత్యం అధ్యయనం చేస్తుంటానని, తన రచనల్లో వాటి ప్రభావం ఉంటుందని తెలిపారు. నారాయణబాబు రచనలు నేటి ఆధునిక రచయితలకు, కవులకు, సాహితీవేత్తలకు మార్గదర్శకమని పేర్కొన్నారు. ఈ సందర్భంగా సాహితీ స్రవంతి నిర్వాహకులు చీకటి దివాకర్‌కు ప్రత్యేక అభినందనలు తెలియజేశారు. ఈ కార్యక్రమంలో ఎస్.కె. బాబు తదితరులు మాట్లాడారు.

---

# సోంపేట ప్రజలకు మద్దతుగా... మరో ప్రయత్నం

బీల... ఆరుగాలం... శ్రమజీవుల ఆకలి తీర్చిన నేల తల్లి గుండె బావి 'ఊటబావి'.

సోంపేటలో థర్మల్ పవర్ ప్రాజెక్టు నిర్మించడానికి ప్రభుత్వం ప్రజల ఆకాంక్షలను అణగద్రొక్కాలని చూసినప్పుడు... ప్రజా కూటమి ఎదురుతిరిన సంగతి తెలిసిందే..!

'సోంపేట... నిస్తేజంగా వున్న నిప్పురవ్వ కాదూ... ఆ పోరాటానికి అనేక సంవత్సరాల నుంచి ప్రేరణా, పునాది వున్నాయంటారు...! ఉద్యమాన్ని దగ్గరగా పరిశీలించినవారు.

గుంటనక్కలా కాచుకుని ఎప్పుడు దాడి చేస్తుందో తెలియని స్థితిలో వున్న 'ముసుగు దొంగ' లాంటి రాజ్యాన్ని... రాజ్యం రక్కసత్వాన్ని నిలువరించడానికి...

"ఉద్యమం అయిపోలేదు... కొనసాగిస్తున్నాం... పది మంది బాగు కోసం నెత్తురు ధారపోస్తూనే వుంటాం...! అంటారు పోరుబాట పట్టిన 'ఉద్యమ భాగస్తులు'.

"ప్రజావాణిని వినిపించే ప్రతీ అక్షరం మా ఉద్యమానికి ఊపిరి లూదుతుంది" అని అనడంలో పోరాటకారుల 'సంఘటనాశక్తి' కనిపిస్తుంది.

కథా రచయిత 'శ్రీ అట్టాడ.. అప్పల్నాయుడు' మాట్లాడుతూ ... "రైతాంగ శక్తులకు - పెట్టుబడిదారీ శక్తులు మధ్య జరిగే సంఘర్షణ ఫలితమే ఇప్పుడీ సోంపేట ఉద్యమం.."

అంటూ... దాని రూపాన్ని తేటతెల్లం చేస్తూ... 'రాజ్యం దురాక్రమణతో శిథిలమవుతున్న దేశానికి మళ్ళీ ఒక దిశ, దశ చూపగల పోరాటాన్ని మనకు సోంపేట అందించింది. దాన్ని నిలుపుకోవల్సిన బాధ్యత మనందరి మీదా వుంది' అని చేయాల్సిన కర్తవ్యాన్ని చెప్పారు.

పర్యావరణ పరిరక్షణ సమితి, సోంపేటకు చెందిన తమ్మినేని రామారావు మాట్లాడుతూ ఉద్యమం అయిపోలేదు. నేటికి 800 రోజుల నుంచీ కొనసాగిస్తూనే వున్నాం... ఉద్యమం కోసం వచ్చిన ప్రతి అక్షరానికి, రచయితకి ధన్యవాదాలు అని ముగించారు.

చివరగా కవి 'రెడ్డి రామకృష్ణ' "సోంపేట చూసొద్దాం రారండి... ఓ అన్నల్లారా అక్కల్లారా...!" పాటతో బీలని, సోంపేట ఉద్యమాన్ని విశదపరిచారు.

'సోంపేట ప్రజలు పోరుకు నా కవిత అదిగో అలాంటి ప్రయత్నమే కవి రెడ్డి రామకృష్ణ చేశారు.

మహాకవి శ్రీశ్రీ జయంతోత్సవం సందర్భంగా ఏప్రిల్ 30న విజయనగరంలో సాహితీ స్రవంతి ఆధ్వర్యాన జరిగిన కార్యక్రమంలో ఆయన రాసిన దీర్ఘ కవిత 'బీల-భూమి-సముద్రం' ఆవిష్కరించబడింది.

అట్టడుగు ఉత్పత్తి కులాలకు చెందిన మత్స్యకార మహిళను నాయకిగా తీసుకుని రాసిన దీర్ఘకవిత - బీల, భూమి, సముద్రం.




'బీల-భూమి-సముద్రం' దీర్ఘ కవిత ఆవిష్కరణ

కార్యక్రమంలో సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ చీకటి దివాకర్ మాట్లాడుతూ మనల్ని కాల్చుకు తినే అభివృద్ధి వద్దు. ప్రగతికి కాస్త సమయం పట్టినా మనల్ని నిలబెట్టే అభివృద్ధే కావాలి' అని ప్రజల గొంతును తన గొంతుగా వినిపించారు.

సాహిత్య విమర్శకులు చింతలపాటి ప్రసాదవర్మ మాట్లాడుతూ ... 'ఇప్పుడు అందాల్సిన జీవితం అందాల్సిన విధంగా లేదు. న్యాయం న్యాయంగా లేదు. అణచివేత, ఆక్రమణ తప్ప మరొకటి లేదు. వీటన్నింటి మధ్య పోరాటం జరపాల్సిన అవసరం వుందని వక్కాణించారు.

- బాల సుధాకర్‌మౌళి

# ప్రపంచీకరణ దుష్పరిణామాలపై మేల్కొలపాలి




'విన్యాసం' పుస్తకావిష్కరణ సభ. చిత్రంలో తెలకపల్లి రవి, జంధ్యాల రఘుబాబు, వల్లభాపురం జనార్ధన, కెంగార మోహన్ తదతరులు

ప్రపంచీకరణ దుష్పరిణామాలపై ప్రజలను మేల్కొలిపేలా తమ రచనల ద్వారా కృషి చేయాలని సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి సాహితీవేత్తలను కోరారు. మే 20న కర్నూలు ఎంపిపి హాల్‌లో సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో కెంగార మోహన్ రచించిన 'విన్యాసం' పుస్తకావిష్కరణ సభ జరిగింది. ఈ కార్యక్రమానికి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథులుగా సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి, జిల్లా విద్యాశాఖాధికారి డాక్టర్ పి. బుచ్చన్న అతిథులుగా సాహితీ స్రవంతి రాష్ట్ర ఉపాధ్యక్షులు వల్లభాపురం జనార్దన్, యు.టి.ఎఫ్. జిల్లా ప్రధాన కార్యదర్శి కె. సురేష్‌కుమార్ పాల్గొన్నారు. ఈ సందర్భంగా తెలకపల్లి రవి మాట్లాడుతూ సామాజిక ప్రయోజనం కోరేది సాహిత్యమని, సాహిత్యం ప్రజలకు చేరువ కావాలంటే విస్తృతంగా సమాజ హితం కోరే రచనలు రావాలని ఆకాంక్షించారు. ప్రపంచీకరణలో మనిషి నుంచి మనిషి దూరమయ్యారని పేర్కొన్నారు. మానవ జీవితంపై సరళీకరణ ప్రభావం గరళీకరణగా మారిందన్నారు. ప్రపంచీకరణ పేరుతో సాగుతున్న ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక దురాక్రమణపైన, చొరబాటుపైనా ఇలాంటి కవితా విన్యాసం చేయడం అవసరమన్నారు. హంద్రీ నదీ తీరాన కవితా పుష్పాల్లా అనేకమంది కవులు, కళాకారులు వికసించాలని ఆయన అభిప్రాయపడ్డారు. ప్రపంచీకరణ నేపథ్యంలో మోహన్ రచించిన 'విన్యాసం' కవితా సంపుటి బాగుందని పలువురు అభినందించారు. పలువురు సాహితీవేత్తలు, సాహిత్యాభిమానులు హాజరయ్యారు.

# భీంపల్లి శ్రీకాంత్‌కు డాక్టరేట్



భీంపల్లి శ్రీకాంత్

పాలమూరు సాహితీ అధ్యక్షుడు, భీంపల్లి శ్రీకాంత్‌కు తెలుగు విభాగంలో డాక్టరేట్ లభించింది. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో భీంపల్లి శ్రీకాంత్ 'మహబూబ్‌నగర్ జిల్లా తెలుగు సాహిత్య వికాసం' అనే అంశంపై చేసిన పరిశోధనకుగాను విశ్వవిద్యాలయం డాక్టరేట్ ప్రదానం చేసింది. ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖ ఆచార్యులు ఆచార్య మసన చెన్నప్ప పర్యవేక్షణలో శ్రీకాంత్ పరిశోధన చేశాడు. పాలమూరు జిల్లా వెయ్యేళ్ళ సాహిత్యాన్ని తన పరిశోధనా గ్రంథంలో నిక్షిప్తం చేసినట్లు ఆయన తెలిపారు. అడ్డాకుల మండలం వేముల గ్రామానికి చెందిన భీంపల్లి శ్రీకాంత్ ఇంతకుముందే పాలమూరు జిల్లా కవుల ఏకైక వచన కవితా సంకలనం 'పాలమూరు కవిత'ను తన సంపాదకత్వంతో వెలువరించాడు. అలాగే పాలమూరు కవితా సుమాలు, అంజలి, కళాంజలి గ్రంథాలకు సంపాదకత్వం వహించాడు. 'సోది' అనే తెలంగాణ హైకూలు కవితా సంపుటిని వెలువరించాడు.

# విమలా శాంతి సాహిత్య పురస్కారం కోసం రచనలకు ఆహ్వానం

2012వ సంవత్సరం "శాంతి రజనీకాంత్ స్మారక కవితా పురస్కారం" పేరుతో ఇచ్చే విమలా శాంతి సాహిత్య పురస్కారాన్ని కవులకు ప్రదానం చేయడానికి జాతీయ స్థాయిలో ఉత్తమ కవితా సంపుటాలను ఆహ్వానిస్తున్నట్లు ఆ సంస్థ ఛైర్మన్ డా॥ శాంతి నారాయణ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పురస్కారం కింద రూ. 10,000/-లు నగదును, జ్ఞాపికను అందజేసి పురస్కార గ్రహీతను సముచిత రీతిని సత్కరిస్తామన్నారు. జనవరి 2010 నుండి డిసెంబర్ 2011 మధ్య కాలంలో ప్రచురించిన కవితా సంపుటాలు మాత్రమే పరిశీలనకు స్వీకరింపబడతాయని తెలిపారు. కవులు తమ తమ కవితా సంపుటాలను 15.07.2012 తేదీలోగా యస్వీ ప్రసాద్, కథా రచయిత, డి.నెం. 28/4/271, విజయనగర్ కాలనీ, అనంతపురం-515 007 అనే చిరునామాకు పంపాలి. పరిశీలన కోసం పంపే కవితా సంపుటాలను నాలుగు కాపీల వంతున పంపాలి. మూడు కాపీల మీద "విమలాశాంతి సాహిత్య పురస్కారం కోసం" అని తప్పని సరిగా రాసి పంపాలి. ఎంపికయిన కవితా సంపుటి రచయితకు 2012 సెప్టెంబర్‌లో జరిగే పురస్కారోత్సవ సభలో అవార్డు ప్రదానం చేస్తారు. ఇతర వివరాలకు 9348278277 ద్వారా సంప్రదించవచ్చు.

# శ్రీశ్రీ భావావేశం ఎంతో అవసరం


శ్రీశ్రీ జయంతి సభలో మాట్లాడుతున్న నిఖిలేశ్వర్.
చిత్రంలో జి. యాదగిరిరావు, తంగిరాల చక్రవర్తి, మోతుకూరి నరహరి, గేరా

ప్రపంచీకరణకు వ్యతిరేకంగా అనేక పోరాటాలు జరుగుతున్నాయి. ఆ పోరాటాల్లో శ్రీశ్రీ భావావేశం ఎంతో స్ఫూర్తినిస్తుందని ప్రముఖ విప్లవ కవి, రచయిత నిఖిలేశ్వర్ అన్నారు. సాహితీ స్రవంతి నగర కమిటీ ఆధ్వర్యంలో తంగిరాల చక్రవర్తి అధ్యక్షతన శ్రీశ్రీ 102వ జయంతిని పురస్కరించుకొని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో ఏప్రిల్ 30న 'శ్రీశ్రీ వర్తమానం' అంశంపై సదస్సు, జనకవనం కార్యక్రమం జరిగింది. ఈ సందర్భంగా ఆయన మాట్లాడారు. శ్రీశ్రీ భౌతికంగా లేకపోయినా, అక్షరాల్లో జీవిస్తున్న గొప్ప వ్యక్తి అని కొనియాడారు. ప్రపంచీకరణ నేపథ్యంలో అస్థిత్వ పోరాటాలు ముందుకొచ్చిన తరుణంలో శ్రీశ్రీ గురించి మాట్లాడుకోవడం ముదావహం అన్నారు. అనాథలు, అభాగ్యుల గురించి కుల, మత, ప్రాంతీయ విభేదాలలో సంబంధం లేకుండా అందరి గురించి ఆలోచించిన గొప్ప కవి శ్రీశ్రీ అన్నారు. అంతేకాదు. ఈ ప్రపంచం కుగ్రామం, గ్లోబల్ సంగ్రామం, ఎడతెగని సంక్షోభం అని నాడే రాశాడంటే ముందుచూపు ఎంతుందో అర్థమవుతోందన్నారు. విద్యారంగం మొదలు, అన్ని రంగాల్లోకి కార్పొరేట్ శక్తుల విజృంభణ పెరుగుతున్నప్పుడు దీనికి వ్యతిరేకంగా పోరాడాల్సిన దిశా దశా ఎంచుకున్న గొప్ప కవి అని చెప్పారు. అందుకే భవిష్యత్‌పై అచంచల విశ్వాన్ని ప్రకటించాడన్నారు. ఉందిలే మంచి కాలం ముందు ముందునా అని చెప్పాడంటేనే పెట్టుబడిదారుల, కార్పొరేట్ శక్తుల కాలం భవిష్యత్‌లో లేదని చెప్పినట్లయిందన్నారు. శ్రీశ్రీని అభిమానించడం అంటే విగ్రహాలకు పూలమాలలు వేయడం కాదని, ఆయన భావాలను ముందుకు తీసుకుపోవల్సిన బాధ్యతను తీసుకోవడమన్నారు. అందుకు సాహితీ స్రవంతి ముందుందనడంలో సందేహం లేదన్నారు. ప్రజాస్వామ్య దేశంలో పాలకులు మనల్ని ఎటు తీసుకుపోతున్నారో అర్థం కాని పరిస్థితి నెలకొందని పాలకుల విధానాలను విమర్శించారు. అక్షరం అలుపు లేని ఆయుధమని, ఈ అక్షరాల ఆయుధాలను మనకిచ్చి వెళ్ళిన శ్రీశ్రీకి వందనాలని ముగించారు. అనంతరం ఏడే అల్లరి వనమాలి అనే లలిత గీతాన్ని నాగశిరీష ఆలాపనతో జనకవనం కార్యక్రమం ప్రారంభమైంది. ఈ కార్యక్రమానికి వెంకటి, గేరా అధ్యక్షత వహించగా మోపిదేవి రాధాకృష్ణ వినిపించిన కవిత చీమలు శ్రమైక జీవన సౌందర్యానికి ప్రతీకలు అనే అర్థంలో చదివిన కవిత సభికులను ఆకట్టుకుంది. అలాగే 'నన్ను గుర్తించారా మీలోఎవరైనా', 'అసలు నేను ఎవరో తెలుసా మీలో ఎవరికైనా!' అంటూ మాతృభాషకు పట్టిన దుర్గతిపై రాసిన కవితను చదివి వినిపించారు. గొలుసు భాస్కరరావు విదేశీ సంస్కృతిని ఆలింగనం చేసుకుంటున్న తీరును తన కవిత ద్వారా చక్కగా వివరించారు. బిగిసిన పిడికిళ్ళు తెరవదు ఆశయాలు సిద్ధించేదాక, రగిలే ఉద్యమాలు పట్టుదల సడలనివ్వదు. విజయం సాధించే దాకా అంటూ ఆశయ బలాన్ని చాటి చెప్పిన కవితను శాంతిశ్రీ చదివి వినిపించారు. నేటి రాజకీయ జీవితంలో పాలకుల కుళ్ళుపై తమ గళాలు, కలాలు చైతన్య దీపికలు వెలిగించే కవితలను చదివి వినిపించారు. కాంతి జ్ఞానానికి ప్రతీకని, రత్నా మహీదర్, ధనమదాందుల పిడికిటిలో దాగిన ఓ... స్వతంత్ర్యమా అని గజివెల్లి రచన, మద్యం మాఫియాపై ధ్వజమెత్తిన కె. రాజశ్రీ, కవిత, ఇలా ఒక్కో కవిత నిప్పు కణికల్లా పాలకులపై విసరినంత ఉద్రేకాన్ని సభికుల్లో నింపాయి.

ఈ కార్యక్రమంలో వొరప్రసాద్, మోతూ్కరి నరహరి, తంగిరాల చక్రవర్తి, నగర కార్యదర్శి యాదగిరిరావు, గేరా, వెంకటి, శాంతిశ్రీ, రాజా, గజవెల్లి, పొత్తూరి సుబ్బారావు, వివిఆర్ శాస్త్రి, సైదులు, వరంగల్ భాస్కర్, కొడిహళ్ళి మురళీమోహన్ తదితరులు పాల్గొన్నారు.

## సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో కవిత్వ శిక్షణా శిబిరం

సాహితీ స్రవంతి, హైదరాబాద్ నగర కమిటీ జూన్ 3 ఆదివారం నాడు సుందరయ్య విజ్ఞానకేంద్రంలో ఉదయం 10 గంటల నుండి సాయంత్రం వరకూ 'కవిత్వ శిక్షణా శిబిరం' నిర్వహిస్తున్నది. నూతనంగా కవిత్వం రాసేవారు, రాయాలని భావించేవారు, ఇప్పటికే కాస్త కవిత్వ పరిజ్ఞానం కలిగి, రాస్తున్నవారి కోసం ఈ వర్క్‌షాప్ ఉద్దేశించబడింది. తెలుగు కవిత్వం పట్ల ప్రాథమిక అవగాహన, కవిత్వం రాయడంలో తగిన శిక్షణను ఈ వర్క్‌షాప్ అందిస్తుంది. ముందు ముందు తెలుగు కవిత్వాన్ని లోతుగా అధ్యయనం చేయడానికి ఈ వర్క్‌షాప్ తోడ్పడుతుంది. ఈ శిక్షణా శిబిరంలో ప్రసంగాలు మాత్రమే కాకుండా భిన్న పద్ధతులలో కవిత్వ నిర్మాణంపై శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ శిక్షణా కార్యక్రమంలో పాల్గొనడానికి మే 26 లోపు రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి. చిక్కడపల్లి, సుందరయ్య విజ్ఞానకేంద్రం, బాగ్‌లింగంపల్లిలో గల ప్రజాశక్తి బుక్‌హౌస్‌లలో మీ పేర్లను నమోదు చేయించు కోవచ్చు. లేదా నెంబర్లు 9490098660, 9490099059, 9393804472 లలో సంప్రదించవచ్చు. ముందుగా పేర్లు నమోదు చేసుకున్నవారికి మాత్రమే అవకాశం ఉంటుంది.

ఈ శిక్షణా శిబిరంలో 'ప్రాచీన కవిత్వం' అంశంపై ఆంధ్రప్రదేశ్ సారస్వత పరిషత్ పూర్వ ప్రిన్సిపాల్ మోతుకూరి నరహరి, 'కవిత్వం-వస్తు రూపాలు' అంశంపై సాహిత్య ప్రస్థానం సంపాదకవర్గ సభ్యుడు, కవి కె. ఆనందాచారి, 'కవిత్వం-దృక్పథం' అంశంపై ప్రముఖ కవి, విమర్శకులు డా. అద్దేపల్లి రామమోహనరావు, 'కవిత్వావరణం' అంశంపై ప్రముఖ కవి, విమర్శకులు డా. సీతారాం క్లాసులు నిర్వహిస్తారు. ఈ శిక్షణా కార్యక్రమంలో పాల్గొని ఈ అవకాశాన్ని ఉపయోగించు కోవలసిందిగా సాహితీ స్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ప్రధాన కార్యదర్శి జి. యాదగిరిరావు విజ్ఞప్తి చేస్తున్నారు.



మే 6న విజయవాడ ప్రెస్ క్లబ్‌లో జరిగిన 'సోమేపల్లి పురస్కార కథలు' ఆవిష్కరణ సభ. చిత్రంలో రమ్యభారతి సాహిత్య త్రైమాసిక పత్రిక సంపాదకులు చలపాక ప్రకాష్, సోమేపల్లి వెంకట సుబ్బయ్య, ద్వా.నా.శాస్త్రి, గుమ్మా సాంబశివరావు, కాపూరి సత్యవతి




ఏప్రిల్ 15న యలమంచిలిలో 'బొడ్డుదిన గంగ' పుస్తకావిష్కరణ సభలో ఆవిష్కర్త డా॥ అద్దేపల్లి రామమోహనరావు, బొడ్డు గంగా భవాని. చిత్రంలో ఆచార్య కొలకలూరి ఇనాక్, డా॥ కాందూరి సీతారామచంద్రమూర్తి, ఐ. సుందరరావు, విశ్రాంత కలెక్టర్ శేషగిరిరావు, పౌరసేవా సంఘం అధ్యక్షులు



సాహితీవేత్త డా॥ బి. జయరాములు రచించిన జీవన రేఖలు పుస్తకావిష్కరణ సభలో రచయితకి ప్రశంసాపత్రాన్ని అందజేస్తున్న అభినందన కార్యదర్శి, భవాని ప్రశంసాపత్రం రాసిన గురజాడ శోభా పేరిందేవి



మే 9న హైదరాబాద్ త్యాగరాయ గానసభలో జి.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ త్యాగరాయ గానసభ నిర్వహించిన కార్యక్రమంలో ముఖ్య అతిథిగా డా॥ సి. నారాయణరెడ్డి ద్వారా కళా సుబ్బారావు స్మారక పురస్కారం స్వీకరిస్తున్న ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక మండలి ఛైర్మన్ ఆర్.వి. రమణమూర్తి, శ్రీమతి కళా శారద, వెంకట దీక్షితులు, డా॥ కె.వి.రమణ, సమాచార హక్కుల చట్టం కమిషనర్ పి.విజయబాబు సంస్థ స్థాపక ఛైర్మన్ గుదిబండి వెంకటరెడ్డి



డా॥ ద్వా.నా. శాస్త్రి రచించిన "తెలుగు సాహిత్య చరిత్ర" 6వ ముద్రణను అమెరికాలో హ్యూస్టన్ నగరంలో మార్చి 10, 11 తేదీలలో జరిగిన మూడవ ప్రపంచ తెలుగు సాహితీ సదస్సులో ఆవిష్కరిస్తున్న విస్ కాన్సిన్ విశ్వవిద్యాలయం తెలుగు ఆచార్యులు వేల్చేరు నారాయణరావు, ఎడమ వైపు ద్వా.నా. శాస్త్రి, కుడివైపు సదస్సు కన్వీనర్ సాయి రాచకొండ



హైదరాబాద్ సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో ఏప్రిల్ 5వ తేదీన పాలపిట్ట బుక్స్ నిర్వహించిన సభలో డా॥ ద్వా.నా. శాస్త్రి రచించిన "తెలుగు సాహిత్యంతో ఉద్యమాలు, వాదాలు ధోరణులు" పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న పొత్తూరి వెంకటేశ్వరరావు. ఎడమ నుంచి ముదిగొండ శివప్రసాద్, పి. రాజేశ్వరరావు, పి. విజయబాబు, ద్వా.నా. శాస్త్రి, సి. మృణాళిని, నగ్నముని, ఓల్గా, వెనుక గూడా అంజయ్య, సుంకిరెడ్డి నారాయణరెడ్డి

